# విషయసూచిక



---

## ప్లవ ఉగాది-ఆకాంక్ష

విద్వాన్-పునుగు శంకరశాస్త్రి

అవనిని మానవుల్ కొఱతయన్నది లేక, ప్రపంచయుద్ధవి
ప్లవములభీతి లేక, ప్రతిభాయుతులై సహజీవనంబునం
దవిరళ శాంతి సౌఖ్యముల నందగ గారణమౌచు మించి యీ
ప్లవయనువత్సరం బతిశుభప్రదమై తనరారు గాపుతన్.

## వీడుకోలు - స్వాగతము

విద్వాన్ వి. చంద్రశేఖరయ్య

ఉర్వికి మేలు కల్గెనొకో?
యూర్జితమైన త్వదీయపాలనన్
బర్వె విరోధభావములు,
పంటలు పండియు దేశమెల్లెడన్
శర్వులునిండె; ప్రేమమయ
నాయకు పంతుని మ్రింగుకొంటివో
శార్వరి నీదు నేలుబడి
చాలును, పొమ్మిక వీడుకోలిదే.

చివురులఁ బూవులన్ బ్రకృతి
చిక్కనియందము చిల్కుచుండగా
గువకువ మంచు శ్రావ్యముగఁ
గోకిలకన్నెలు పాడుచుండ; మా
నవులభయమ్ము బాపి మది
నవ్యవికాసముగూర్ప నెంతయున్
'ప్లవ' యరుదెంచితే? యిదిగో
స్వాగతమిత్తుము చేకొనంగదే.

# నేడే చూడండి!


ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ సమర్పించు
భార్యాభర్తలు
నిర్మాత:
స్క్రీన్ ప్లే, దర్శకత్వం:
ఎ.వి.సుబ్బారావు • కె.ప్రత్యగాత్మ



వ్యవస్థాపకురాలు: దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 17 :: ఏప్రిల్, 1961 :: సంచిక 4

# మన బడ్జెట్ల రుతువు సంఘ సంక్షేమ సంఘాల ఆర్థికాలు

మన దేశంలోని ఆ యా ప్రాంతాల వాతావరణాల్ని చక్కగా పరిశోధించిన మనపెద్దలు, ఏడాదికి ఆరు రుతువులు ప్రవర్తిస్తాయని నిర్ణయించారు. పాశ్చాత్యుల కలాటి రుతువులు నాలుగే, రుతువులనేవి, కాల పరివర్తనాలనుబట్టే కాకుండా, కార్యపరివర్తనాలనుబట్టి కూడా ఏర్పడతాయి. జనాభా రుతువు, బడ్జెట్టు ప్రభుత్వాదాయవ్యయాలరుతువు, ఎలెక్షనుల రుతువు—ఈ మోస్తరువే అనేక రుతువులు.

ప్రకృతం మనం ముఖ్యంగా గమనింపతగ్గవి కార్యకారణంగా సంభవించే ఋతువులను గూర్చి మాత్రమే. (1) జనాభారుతువు కొట్టకొనసకు వస్తున్నది. ఇందుకై నియమితులయిన ఉద్యోగుల నివేదికల్లో ఎన్ని తబిసీళ్ళు వుంటాయో, యెవరు కనిపెట్ట గలవారు.

ఇకపోతే, ఇది బడ్జెటులరుతువు. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు, దాదాపు అన్నీకూడా రాగల వార్షికాదాయవ్యయాల నివేదికల్ని శాసన సభలకు సమర్పించింది. శ్రీ మురార్జి దేశాయిగారు లోక్ సభలో లోటు బడ్జెటును ప్రవేశపెట్టారు. రాగల సంవత్సరం— పన్నులు, సుంకాలు మొదలైన వాటిని ఇప్పుడున్నట్లే ఉంచటంవల్ల-నికరమయినఆదాయం రు 962.92 లు —అని అంచనా వేశారు. వ్యయభాగానికి వచ్చినప్పుడు రు 1023.52 లు కాగలవనిన్ని, కాగా, 60.60 కోట్ల వరకు లోటు తగులుతుందనిన్ని ప్రకటించారు. రాగలయేట, దేశరక్షణశాఖ (సైన్యాధికం) క్రింద రు 16.2 వఱకు అధికవ్యయం అవుతుందన్నారు.

ఈ లోటును పూడ్చటానికి ప్రజానీకం, ఇచ్చేరుణాలద్వారా రు 235 కోట్లు, స్వల్పసేకరణ—(Small Savings) వల్ల రు 105 కోట్లు, పరదేశాల సహాయంవల్ల రు 421 కోట్లు, ఋణాలు రాబట్టడంవల్ల 176 కోట్లు, పెట్టుబళ్ళమీది లాభాలవల్ల రు. 96 కోట్లు, చిల్లరమల్లర ఆదాయాల వల్ల రు 104 కోట్లు ఆదాయాలు వచ్చే అవకాశాలున్నాయని శ్రీ దేశాయిగారు చెప్పారు. వారు నిరుపేదలకి నిత్యోపయోగావసరాలైన-పోకచెక్కలు, కిరసనాయలు, పొగాకు, కాఫీ-టీ— ఇలాంటి సరకులకు అధనపుపన్ను విధించారు. దీనివల్ల రు 60—87 కోట్లు వస్తుందనిన్ని, లోటును భర్తీచేయగా రు 27 లక్షలు పైగా మిగుల్తాయనిన్ని ఆయన చెబుతున్నారు.

# మన బడ్జెట్ల రుతువు

ఆర్థికమంత్రిగారు పాటకజనాలు పారిశ్రామికులు, కాయకష్టజీవులు మొదలయిన బక్క జనాలమీద దెబ్బతీశారు. అన్నం లేకున్నా, గంజికూడా శూన్యం అయినా– బీదలయినవాళ్ళు రవంత చెక్క–పొగాకు బుగ్గని పెట్టుకొని రోజంతా పస్తుండి అయినా పనిచేయగలరు. ఇత్తడిడబ్బాలలో త్రోవను అమ్మే టీకి 6 నయాపైసా లిచ్చి, దాన్ని త్రాగి ఆకలి, దప్పిక, అలసట తీర్చుకొని పనిచేస్తాడు. అంతకంటే వాళ్ళు చేయగలిగిందేముంది. అగ్గిమోస్తరు రగులుకు పోతుండే తిండి సరకుల ధరలు నానాటికి పెరిగిపోవటం చూసి, కడుపు తరుకుపోతుండగా ఉన్న నాడొక వేళ– అదీ అరకడుపుకు, భార్యాబిడ్డలతో తిని జీవయాత్ర సాగిస్తున్నారు.

ఇది ఇలా వుండగా, ఆంధ్రప్రభుత్వం పన్నులు, పొడిగించలేదని పేరేగాని, బడ్జెట్టులో లోటు మాత్రం తప్పలేదు. అన్ని రాష్ట్రాలు ఇంచుమించు ఇలాటి బడ్జెట్లనే ప్రకటించాయి. ఇది అలావుండగా రాష్ట్రాలుగాని, కేంద్రంగాని– ప్రత్యేకంగా సంఘసంక్షేమ సంస్థల ఊసే తీసుకోక పోవటం గమనింప తగ్గది. మంత్రివర్గ సభలో సమావేశం అయ్యే మంత్రులు, తమతమ శాఖల వరకు, అయిటం వారీగా ఇంతింత కేటాయించాల్నని ఆర్థికమంత్రులకు సలహాలిస్తారు. అలాటివారు మహిళాభ్యుదయ కరాలయిన సంఘసంక్షేమ సంస్థలకు ఇంతసొమ్ము ప్రత్యేకించాల్నని పట్టుపట్టే పాపానపోరు. వాళ్ళ దృష్టిలో సంక్షేమ సంస్థల విషయం అలక్ష్యంగా–ఔదాసీన్యంగా అప్రయోజకంగా కనబడటమే ఇందుకు కారణమయి వుంటుంది. లేదా యే రాష్ట్రమంత్రికి అయినా దీన్ని పదిశాఖల్లో పదకొండోదిగా అంటగట్టేరు అనుకుందాం. ఆ సచివోత్తముడు కట్టకడపటిదిగా సంఘసంక్షేమ వ్యవహారాలకి వస్తాడు. ఉండటానికేమో, మండల సంక్షేమాధికారు (District Welfare Officers), డివిజనల్ వెల్ఫేరు ఆఫీసర్లు బోలెడుమంది వున్నారు. వారు సంఘ సంక్షేమ కార్యాల విషయాల్లో ఏ మాత్రం శ్రద్ధవహిస్తున్నారనేదే మనకిప్పుడు కావలసింది. ఒక్క నెల్లూరు మండలంలోనే–నార్త్‌కు ఒకరూ సౌత్‌కు ఒకరూ–డిస్ట్రిక్టు వెల్ఫేరు ఆఫీసరు ఉన్నారు. నిజానికి వీళ్లు జిల్లాలో– ఎన్ని సంఘ సంక్షేమ కేంద్రాలను స్థాపింపగలిగారు. వాటి అభివృద్ధికి తామెలాదోహదం ఇస్తున్నారు.

ఆయా ప్రాంతాల్లో పలుకుబడి, సంపద, ఘనతగలిగిన ప్రజలే ఈలాటిసంస్థలు స్థాపించి తన్మూలకంగా (ముఖ్యంగా) మహిళలకు గృహపరిశ్రమల్లోను–విజ్ఞానాభివృద్ధిలోను తగిన తరిబీతు ఇస్తున్నారు. అలా తయారయిన అబలలు ధనాదాయ విషయాల్లో కుటుంబాలలోని ఆర్జనాపరులకు సహకరిస్తున్నారు. రెండుపూటలా తిండి, కట్టుకోడానికి బట్ట ఉండటమే సంసారాల సమృద్ధికి తార్కాణం. అవిరెండు కరవైననాడు సామాన్యప్రజకు పస్తులు చీకిపాతలు తప్పవు. మితిలేని ఆదాయం వచ్చేవారికి వేళవేళకు నానావిధాలయిన (రోగాలు పుట్టుకొచ్చే) ఆహారాలు ఉడుపుల మీద ఉడుపులు– వేడుకలు, వినోదాలూనూ. పావలాకూడా చేతలేదే సందేవేళ బిడ్డల గంజి నీళ్ళకేమిగతి?– అని బీదలు, సామాన్యజనులూ అంగలారుస్తుంటే, ఉన్న కరెన్సీనోట్లు ఎట్లు ఖర్చు పెట్టగలమా?–అని ధనవంతులు ఆరాటపడుతూంటారు. ఇది నేటి లోకంపోకడ! ఇక మన భారత దేశవిషయం ప్రత్యేకంగా చెప్పడమెందుకు?

మన శ్రీ దేశాయిగారే, కాదు,–అగ్రశ్రేణికి చెందిన నాయకుల మనుకునేవారూ. ప్రభుత్వంలో గొప్పపదవులలో ఉండేవారందఱూ "కుటుంబనియంత్రణం" "సంతాన నిరోధం" పొదుపువిధానం– మొదలైన వాటినిగూర్చి చిలక పలుకులు పలుకుతూంటారు. ఇందులో నానా

టికి పెరిగిపోతూండే కుటుంబాలలో నియంత్రణమనేది అర్థంలేని వ్యర్థప్రలాపం. ఇక సంతాన నిరోధం అనేది ఆచరణలో పెట్టటం బ్రహ్మాతరంగాదు. అరవై వేలమందికి జనకుడైన సగరచక్రవర్తి కాలంలోగాని, నూర్గురు కొడుకులనుగన్న దృతరాష్ట్రుని కాలంలోగాని, ఇంతెందుకు? నిఖాచేసుకొన్న అనేక భార్యలవల్ల ఎందరు కొడుకులనో కన్న నైజాంగారి స్వతంత్ర పాలనాకాలంలోగాని- ఈ "సంతాననిరోధ సమస్య తలెత్తలేదు. అయితే, ఆరోజులకు- నేటికీ- తేడా అజ గజాంతరం. దేశవ్యాప్తంగా జనాభా పెరిగి కరవులు కాటకాలు అధికమైంది నిజమే. కాని దానికి సంతాన నిరోధానికి లంకెపెట్టటం అనుచితం. ఈనాడు ప్రతిస్త్రీకి, ప్రతిపురుషుడికి విద్యావంతులై ప్రభుత్వోద్యోగాలు వెలగబెట్టి సంపాదించాల్ననే కాంక్ష ఒకటి చెలరేగింది. ఏ తత్కారణంగా గృహపరిశ్రమలు, సేద్యనాద్యాలు చాలావరకు దెబ్బతిన్నవి. పోనీ-పురుషులతో పాటు పురంధ్రులుకూడా విద్యావంతులై పదవుల కెగబడటం ఒక విధంగా హర్షించ దగిందే. కాని, విద్యావిహీనులయిన మహిళలగతి మాత్రం శోచనీయమే. కాగా గృహిణులలో వయోజన వద్యా విధానం వ్యాపకం కావాలి. పైగా కుటీరపరిశ్రమలము ఆయా ప్రాంతాలకు అనుగుణంగా అందుబాటులో వుండేవి) అములుకు రావాలి. కుశాగ్రబుద్ధులైన వనితలకి వారివారి అభిరుచుల్ని అనుసరించి లలితకళలో తరిబీతు ఇవ్వాలి. అలాచేస్తే, కుటుంబాల్లోని స్త్రీలు కూడా సంపాదన పర్లై సంసారాలు గమ్యతగా- గుట్టుగా నెట్టుకొని పోవటానికి అవకాశాలు ఏర్పడతాయి. వ్యక్తిగతంగా, ఎవరికివారు తమ ఆత్మ గౌరవం చెడకుండా ద్రవ్యార్జనం చేసుకొంటూ, ఇతరులపైన ఆధారపడకుండా తమకాళ్ళమీదే తాము నిలిచి జీవింపగలుగుతారు.

వ్యర్థంగా కాలం గడపకుండా ఏ వృత్తిలోనైనా సరే, సంక్షేమ కేంద్రాలలో కొంత కాలం తరిబీతు పొందే పక్షంలో ఆర్థికంగా కుటుంబాలకు స్త్రీజనం తోడ్పడవచ్చును. నూలువడకటం, బట్టలు నేయటం, రంగులు అద్దటం, చాపల్లల్లటం, బుట్టలు అల్లటం, వలసంచులు, బనీనులు పరికిణీల బార్డర్లు తయారు చేయటం, తలగళ్ళ గలీబులు, మేజాబల్లల గుడ్డలు, చేతిరుమాళ్ళు మొదలైన వాట్లలో రంగుదారాలతో- తీగెలు, పూలు, తదితరాలు చిత్రవిచిత్రంగా, సృష్టించటం. జిగినీ పనులు చేయటం, పూసలతో గదులతోరణాలు గ్రుచ్చటం, డబ్బు సంచులు కూడా నిర్మించటం, బుక్కులు బైండు చేయటం, అచ్చుకూర్చటం, ముద్రించటం, తివాసీలు పరుపులు తయారించటం. ఉడుపులు చేతితోను కుట్టుయంత్రాలతోను కుట్టటం బట్ట ముక్కలతోను, అట్ట ముక్కలతోను బొమ్మలు, ఆటవస్తువులు సిద్ధపరచటం-చిత్రాలువ్రాయటం పేముపనులుచేయటం మొదలైన వాటిలో శిక్షణ కొంతకాలం వరకు పొందటానికి సంఘసంక్షేమ కేంద్రాలలో తగిన అవకాశాలను కలిగించటానికి, కేంద్ర నిర్వాహకులకు ఆర్థికంగా తోడ్పడుతూ, తగిన ప్రోత్సాహం ఇవ్వటం, ప్రభుత్వంయొక్క కనీసపు కర్తవ్యం, కాని రాష్ట్రపాలక వర్గం అలాచేస్తున్నదా అంటే లేదనే చెప్పాలి. దానికి కారణం వారికి ఈ సంఘసంక్షేమ కేంద్రాలమీద ఉండే అశ్రద్ధే అనటం సత్యదూరంకాదు. అలాటప్పుడు దానికి పెద్దపెద్ద జీతాలతో ఆఫీసర్ల నియామకం నిష్ప్రయోజనం.

సంఘసంక్షేమ కార్యాల అభివృద్ధికి మూడవ పంచవర్ష ప్రణాళికానుసారం 5 కోట్ల రూపాయలు కేటాయించినట్లు తెలుస్తున్నది. కాని మనదేశంలోని (మొన్నటి బొంబాయిరాష్ట్ర విభజననుకూడ చేర్చుకొంటే) 15 రాష్ట్రాలున్నాయి. దామాషా ప్రకారం సరాసరి ఒక్కొక్క-

రాష్ట్రానికి దీన్ని పంచినపుడు 30 లక్షలు వస్తాయి. ఈ మొత్తం అమాత్యులు వ్యయం చేస్తారనే నమ్మకమేముంది? అది పైపయిన్నే హరించిపోతుంది.

విద్యాగంధంలేనివాళ్ళు—తక్కువ చదువు చదివి చేవ్రాళ్ళు మాత్రం చేయగలవాళ్ళు—సంఘసంక్షేమ కేంద్రాల ప్రవేశానికి అనర్హులయిన వాళ్ళు— ఇంటిలోనే అభ్యాసవశాన విస్తళ్ళు కుట్టటం, అప్పళాలువత్తటం. వడలు వూరుగాయలు వరుగులు తయారుచేయటం మున్నగుపనులు చేయతగును. కాని ఇట్టి వ్యాపారాలు చేయటానికి అభిజాత్యంగలవారు జంకుతారు. వారికి ఆత్మాభిమానం అడ్డుపడుతుంది. ఆ యీ కారణాలను బట్టి మహిళలను మూడు రకాలుగా విభజింపవచ్చును. 1. విద్యావతులు వీరు (పాలిటెక్నికల్) సాంకేతిక విద్యలతో పదవుతోబాటు ద్రవ్యార్జన చేయవచ్చును. (ఈ సందర్భంలో విశ్వవిద్యాలయ పట్టభద్రురాండ్ర ఊసు మన కక్కరలేదు. 2. ఉన్నతపాఠశాలాంత (S. S. L. C.) పరీక్షలకుగాక కొంచెం తక్కువ చదువు చదివిన వాళ్ళు వీళ్ళు సంఘసంక్షేమ కేంద్రాలలో విద్యతోబాటు ఏదైన ఒక జీవనోపాయ వృత్తిగూడా నేర్వవచ్చును. బొత్తిగా విద్యలేనివాళ్ళు, వీళ్ళు ఇండ్లలోనే తమకే వృత్తి నచ్చుతుందో ఆ వృత్తి చేపట్టవచ్చును.

ఏతావాతా తేలిందేమంటే-వనితామణులు పైకి రావాలంటే ప్రభుత్వ సహకారం ఉంటేగాని వీలుగాదు. ఒక్క పురుషుల వల్లనే కుటుంబాలు సంపద్వంతాలు గాజాలవు. ఈ సత్యాన్ని గుర్తించిననాడు మన ప్రభుత్వం మన భారతదేశాన్ని కూడా అన్ని విధాలా పురోభివృద్ధికి తెచ్చి పరదేశాలతో తులతూగేటట్లు చేయగలదని మా విశ్వాసం.

---

# గురుదక్షిణ

## తేలిదేవర వెంకటబాలకృష్ణరావు

అది దట్టమైనఅడవి. అందులో చెట్లేవీ విడివిడిగా కనబడక వాటిశాఖలన్నీ ఒకదానితోఒకటి (పెనవేసుకుని) వుండడంవల్ల అరణ్యంఅంతా దగ్గరదగ్గరగా ఊడలుదింపుకుని సువిశాలంగా విస్తరించిన ఒకేఒక మహావృక్షంలా కనపడుతుంది.

పట్టపగలే ఆ అడవిలో చీకటిగా వుంటుంది. అక్కడి కాలిబాటలతో పరిచయం వున్నవారికే అక్కడి సందుగొందులలో తిరగటానికి అలవాటయి వుంటుంది. ఎవరికీ చీకటిపడింతర్వాత ఆఅడవిలోంచి ప్రయాణంచెయ్యడం సాధ్యంగాదు.

ఒకనాటి సూర్యాస్తమయ సమయంలో ఒకయువకుడు ఆ అరణ్యమార్గంగా ప్రయాణంచేస్తున్నాడు. అతని ఎడమ భుజంమీద ఒకజింకకళేబరం కుడిచేతిలో ఒకగొడ్డలీ వున్నాయి. కార్యసాధనవల్ల కలిగినఆనందం అతనివదనంలోనూ, త్వరగా యిల్లుచేరుకోవాలనే ఆతృత అతని గమనంలోనూ గోచరిస్తున్నాయి.

దారిలో ఒకచోట నిలబడ్డాడు. గొడ్డలిని ఒకచెట్టుకు చేరవేసేడు. ఎడమభుజంమీది జింకని కుడిభుజానికి మార్చుకున్నాడు. తాపీగా ఊపిరిపీల్చుకున్నాడు. నుదుటిమీద చెమటతుడుచుకుంటూ కాస్త యిటూఅటూ వంగి ఎదురుగా దూరానికి దృష్టిసారించేడు కతిపయదూరంలో అరణ్యానికి అవతలవున్న గుడిసెల్లోంచి ఒకటిరెండుదీపాలు సన్నసన్నగా అతనికి కనిపిస్తున్నాయి.

తృప్తిగా మరోకసారి ఊపిరిపీల్చుకున్నాడు. భుజంమీద బరువును సరిగ్గా సర్దుకుని గొడ్డలి తీసుకుని ఉత్సాహంతో నడక సాగించేడు.

గుడిసెచేరేడు. గొడ్డలి క్రింద పడేసి, భుజంమీది బరువు దింపుకున్నాడు.

అలికిడి విని, "ఎవరువారు?" అని ప్రశ్నించింది గుడిసెలోంచి ఒకకంఠస్వరం.

"నేనమ్మా" కొంచెం బరువుగా సమాధానం చెప్పేడు యువకుడు. "ఇంత చీకటిపడేదాకా ఏంచేస్తున్నావు నాయనా" అంటూ తల్లి బయటికి వచ్చింది. ఆమెవెనకాలే దీపం చేత్తో పట్టుకుని ఒకవృద్ధుడుకూడా బయటికి వచ్చేడు.

"పెందరాళే యింటికి వచ్చేస్తుండాలిరా బాబూ; యింకా పసివాడివి పొద్దుగూకింతర్వాత బయట మసలకూడదు. తెలిసిందా" ఆజ్ఞాపూర్వకమైన సలహా యిస్తూ దీపం కిందపెట్టేడు వృద్ధుడు.

ఇంతట్లోకే పక్కగుడిసెలోంచి ఓ పదహారేళ్లమ్మాయి పరుగెత్తుకుంటూవచ్చి, "వచ్చేవా ఏకలవ్యా, యింత ఆలస్యం అయిందేం యివాళ?" అంటూ అతని రెండు చేతులూ పట్టుకుని చిలిపిగా కుదిపింది.

దీపంవెలుగులో ఆముగ్గురి దృష్టులూ ఒకసారి పడ్డాయి ఆజింకమీద.

"ఎంతపెద్దజింకో? ఎక్కడ సంపాదించేవు దీన్ని?" అంటూ ముగ్గురూ యించుమించు ఒకేసారి ప్రశ్నించేరు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

ఆప్రశ్న అతనికి అభినందనలా వినిపించింది. తనశ్రమ తగ్గిపోయినట్లనిపించింది.

"కరినగరాన్నుంచి వస్తూంటే ఒకచోట ఒకచెట్టుకింద రెండుజింకలు కనపడ్డాయి. దూరంనుంచే నాచేతిలోని గొడ్డలిని వాటిమీద గురిచూచి విసిరేను. అది ఒకజింక కడుపునుచీల్చి పడగొట్టింది. రెండో జింక పారిపోయింది. జింకమాంసం అంటే మనచిన్ని చెవిగోసుకుంటుందిగదా అని యింటికి పట్టుకొచ్చేను" అన్నాడు, యువకుడు.

"సరే దీన్ని రేపువండుకుందాం; కాళ్లూ చేతులూ కడుక్కో. మీనాయన కూర్చున్నారు నువ్వు వచ్చేదాకా భోంచెయ్యకుండా" అంది తల్లి.

"రేపు వండుకోవచ్చునంటావేమిటమ్మా, యీరాత్రి అంతా చిన్నికి నిద్రపట్టదు. రాత్రంతా దానిదృష్టి జింక మాంసంమీదే వుంటుంది" అన్నాడు నవ్వుతూ ఏకలవ్యుడు. చిన్ని సిగ్గుపడింది. "చాల్లే, ఊరుకో నీమాటలూ నువ్వూనూ" అంటూ పారిపోయింది.

వృద్ధదంపతులు పరస్పరం చూచుకుని నవ్వుకున్నారు. జింకమాంసాన్ని రేపటివంటకి సిద్ధంచేసుకుని భోజనాలకు కూర్చున్నారు.

"అయితే గురిచూచి గొడ్డలి విసరడం నీకు బాగా తెలిసిందన్నమాట" అన్నాడు తండ్రి ముద్ద నములుతూ.

"గొడ్డలేమిటిగాని నాన్నా, విల్లూబాణాలూ అయితే బలేబాగుంటుంది. అది నేర్చుకోవాలనుంది నాన్నా నాకు" అన్నాడు కొడుకు.

"విలువిద్యా? సరిసరి" అన్నాడు, తండ్రి.

"అవును నాన్నా కరినగరంలో ఒకగురువుగారున్నారుట. రాజకుమారులకు విలువిద్య ఆయనే నేర్పుతూంటారుట. ఆయనదగ్గరే నాకు కూడా నేర్చుకోవాలని వుంది" అన్నాడు ఏకలవ్యుడు.

"ఓరిపిచ్చివాడా" అంది తల్లి.

"ఏమమ్మా నేను నేర్చుకోలేనంటావా? నేర్చుకోకూడదంటావా?" అమాయికంగానే అడిగేడు కొడుకు.

"ఏడిశావులే, ఊరుకో. నక్కఎక్కడ? దేవలోకం ఎక్కడ? అలాంటి ఆలోచనలేవీ పెట్టుకోకు" గట్టిగా గదిమేడు తండ్రి, ఏకలవ్యుడు ఏమీ మాట్లాడలేక పోయేడు.

భోజనాలయేయి.

పడుకున్నాడన్న మాటే గాని ఏకలవ్యుడికి ఒకటే ఆలోచన. విల్లూబాణాలూ. బాణాలూ విల్లూ. అవి ఎంత బావుంటాయి. వాటితో మృగాల్ని కొట్టడం ఎంత సులువు. అవి పుచ్చుకుని వేటకెడితే ఎంత ఉల్లాసంగా వుంటుంది! తను విలువిద్య నేర్చుకోవాలి. తను విలుకాడవడం తనతల్లిదండ్రు లిద్దరికీ యిష్టంలేదు. ఎంచేతో తనకు తెలియడంలేదు. ఒకవేళ తనకావిద్య రాదను కుంటున్నారేమో. ఎందుకురాదు? తనకంత సరదా వుండే రాకపోడమేమిటి! తప్పకుండా వస్తుంది, తప్పకుండా నేర్చుకోవాలి. నేర్చుకొనితీరాలి. బాగా నేర్చుకున్న దాకా ఎవరికీ తెలియనివ్వకూడదు. ఎవరికీ తెలియకుండా తనే స్వయంగా వెళ్లి ఆగురువుగారిని అడగాలి. ఆయన దగ్గరే నేర్చుకోవాలి, తను ఒకగొప్పవిలుకాడవాలి. అయే దాకా చిన్నికికూడా తెలియపర్చకూడదు. యిలాంటి ఆలోచనలతోనే అతనికి నిద్రపట్టింది.

◆ ◆ ◆

ధృతరాష్ట్రుడు తనసన్నిహితులతో యిష్టాగోష్టి సలుపుతున్నాడు. అతనికిరువైపులా విదురుడూ, సంజయుడూ ఆసీనులైవున్నారు. తక్కినవారు యథోచితాసనాల నలంకరించివున్నారు.

ద్రోణాచార్యుడు ప్రవేశించేడు అతనికి గౌరవ సూచకంగా అందరూ ఒకసారి లేచినిలబడి; అతను కూర్చున్న తర్వాత, అందరూ కూర్చున్నారు.

ధృతరాష్ట్రుడు ఆచార్యుని ఉచితరీతిని అభినందించి, గురుదేవా, రాజకుమారులందరూ గురుభక్తిప్రవత్తులతోనూ, వినయవిధేయతలతోనూ ప్రవర్తిస్తున్నారా? వివిధాయుధ విద్యా సముపార్జనకు ఆసక్తి చూపుతున్నారా? వారి విద్యాకౌశల్యాన్నిగురించి, తను ముఖతః ఒకింత వినగోరుతున్నాను" అన్నాడు.

ద్రోణుడు చెప్పేడు "మహారాజా, రాజకుమారులందరూ వివిధాస్త్రశస్త్రవిద్యా పారంగతులవుతున్నారు. అర్జునుడు లోకైకవీరుడవుతాడు. ధనుర్విద్యలో అతనికి సరితూగగలవాడు ప్రపంచంలో ఎవడూ ఉండబోడు.

ధృతరాష్ట్రుడు దుర్యోధనునివిషయం ప్రశ్నించగా, "అతడు అనుపమ శరీరబల సంపన్నుడు. గదా ముష్టి యుద్ధాలలో అతనికతడే సాటి భీమసేనుడుగూడా అతని తర్వాతివాడే" అన్నాడు. గురుదేవుడు ధృతరాష్ట్రుడు సంతసించి, "అతనిమీదనే నేను ఎన్నో ఆశలు పెట్టుకున్నాను," అన్నాడు.

కొంచెంసేపాగి, ద్రోణాచార్యుడు ప్రస్తావన మార్చేడు. "మహారాజా, అంగశూరసేన రాజ్యాలనుండి, కొన్ని ఆందోళనకరమైన వార్తలు వినవస్తున్నవి. అవి తమ సామంత రాజ్యాలే ఆవార్తలను మనం వినీవిననట్లు నిర్లక్ష్యం చేస్తే అటువంటి ఉపద్రవాలు మన రాజ్యంలోనే సంభవించగలవు."

"ఉపద్రవాలు" అన్న మాట విని ధృతరాష్ట్రుడు ఉలిక్కిపడ్డాడు.

సంజయుడు వివరించేడు. "అవును మహారాజా, శూరసేనభూజాని తనకుమారునిచేతనే పదవీభ్రష్టుడై ప్రస్తుతం కారాగార నివాసక్లేశం అనుభవిస్తున్నాడు. అతని కుమారుడు పితృద్రోహి. వర్ణాశ్రమధర్మవ్యవస్థకు అతడు పూర్తిగా విరోధి. అక్కడపరిస్థితులలా వుండగా, యిక ప్రాగ్దేశంలో జరాసంధుడు బ్రాహ్మణమతద్వేషి అయినాడు. అతడంత్యవర్ణజులకూ, దాశార్హులకూ నూతన సౌకర్యాలనూ, విస్తృతాధికారాలనూ యిచ్చి, ధర్మ విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు."

ధృతరాష్ట్రుడు నిశ్శబ్దంగా వింటున్నాడు. ద్రోణుని ముఖం ఎర్రబడుతోంది. సంజయుడు మళ్లీ అందుకున్నాడు. "మహారాజా, అక్కడి శూద్రకులజులు కొందరు విలువిద్య నేర్చుకోడానికి ఆసక్తి చూపుతున్నారనికూడా వార్తలు వస్తున్నవి."

ద్రోణాచార్యుడు రౌద్రాకారుడై లేచి నిలబడ్డాడు. "ధనుర్విద్యాసముపార్జన ఒక్కక్షత్రియులకుమాత్రమే కుల ధర్మం. దానియందీనాడు శూద్రులు ఆసక్తి చూపుతున్నారంటే, అది వర్ణాశ్రమధర్మవిరుద్ధం. యీ విషయాలను యిప్పుడు నిర్లక్ష్యం చేస్తే, రేపు వారు వేదాధ్యయనంకూడా మొదలుపెడతారు."

ధృతరాష్ట్రుడు దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

ద్రోణాచార్యుడు మళ్లీ ప్రారంభించేడు. "మహారాజా వర్ణాశ్రమధర్మాలు వేదవిహితమైన విషయం తమకు తెలియనిదిగాదు. అవి బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులనే చతుర్వర్ణములవారికి ఉల్లంఘింపరానివి. అతిక్రమించ కూడనివి. రాజ్యంలో ఏవర్ణములవారైనా వారి వారి కులవృత్తులను విసర్జించడంగాని, యితరుల కులవృత్తులను అవలంబించడంగాని చేస్తే, వారు దండనార్హులవుతారు. అదేవిధంగా, యితర వర్ణాలవారిని ద్వేషించడంగాని, యితరుల వృత్తులను హేయభావంతో చూడ్డంగాని, సహింపరాని దోషాలే అవుతాయి. అటువంటి దుష్టశక్తులు ఎక్కడ తలెత్తినా, వాటినన్నిటినీ వెంటనే రూపుమాపి, వర్ణాశ్రమ వ్యవస్థను సక్రమంగా నడిపించవలసిన బాధ్యత రాజ్యపాలకులపైననే వున్నది."

ధృతరాష్ట్రుడు సావధానంతోనే వింటున్నాడు.

ద్రోణుడు మళ్లీ అందుకున్నాడు "మహారాజా తొల్లి శ్రీరామచంద్రుని పరిపాలనలో జరిగిన ఒకసంఘటన యీ సందర్భంలో తమకు వివరించవలసివున్నది. ఆకాలంలో, శంభూకుడి నాయకత్వంలో కొందరు శూద్రులు చెలరేగి వర్ణాశ్రమధర్మవ్యవస్థకు ఉపద్రవకరంగా ప్రవర్తించినప్పుడు ఆదశరథాత్మజుడు వశిష్టులవారి ఆదేశానుసారంగా,

వారినందరినీ దండించి, సాంఘికవ్యవస్థకు వచ్చిన అపాయాన్ని తప్పించేడు.”

ధృతరాష్ట్రునికి తనప్రస్తుత కర్తవ్యం బోధపడడంలేదు. ఆచార్యుడు సూచించేడు. “మహారాజా మనమిప్పుడే ఆ యా దేశాధీశులకు మననిరసనను తెలియపర్చవలసివున్నది; గాంధార, మద్ర, కోసలాధీశులకు కూడా కబురు చెయ్యవలసివున్నది.

ధృతరాష్ట్రుడు ఒకనిర్ణయానికి వచ్చినతర్వాత గోష్ఠి చాలించేడు.

♦ ♦ ♦

ప్రతిదినమూ, సూర్యభగవానుడు తనదినచర్యప్రారంభించిన సమయానికే, గురుదేవుడుకూడా శిష్యసమేతంగా బయలుదేరుతాడు. జవనాశ్వాలు పూన్చిన వారిరథాలు పశ్చిమాభిముఖంగా కొంతదూరం ప్రయాణించి ఒక నిర్ణీత ప్రదేశం చేరతాయి. గురుదేవుడు అక్కడ కొంతసేపు శిష్యులకు వివిధాస్త్రశస్త్రవిద్యలను గఱపుతాడు. శాస్త్రోక్తంగా సాధకం చేయించుతాడు. వారివిన్యాసాలను అవలోకిస్తాడు. మాధ్యాహ్నికానికి వారందరూ రాచనగరు చేరతారు.

ధృతరాష్ట్రనందనులకూ, పాండురాజకుమారులకూ ద్రోణుడు అస్త్రవిద్యాధ్యాపకుడుమాత్రమే గాదు. వారికతడు తఱచుగా వేదవేదాంగలపైనా, వర్ణాశ్రమాలపైనా ఉపన్యాసాలనిస్తుంటాడు క్రమంగా వారి నతడు సకలవిద్యాపారంగతులుగా, రాజనీతిజ్ఞులుగా, పరిపాలనాదక్షులుగా తీర్చి దిద్దుతున్నాడు.

ఆరోజతడు వారికి బ్రాహ్మణమతాధిక్యతను గురించీ అగ్రవర్ణజుల ఆదేశాలను రాజ్యపాలకులు శిరోధార్యాలుగా పరిగణించవలసిన ఆవశ్యకతనుగురించీ బోధిస్తున్నాడు.

ఆసమయంలో ద్వారపాలకుడువచ్చి, శూద్రయువకు డొకడు గురువర్యుల దర్శనాన్నభిలషిస్తున్న విషయం విన్నవించేడు.

“శూద్రుడా?” కొంచెం ఆలోచించి “లోనికి ప్రవేశపెట్టు” అన్నాడు ద్రోణుడు.

గౌరవర్ణదేహుడైన యువకు డొకడు నెమ్మదిగా లోపలికి వచ్చేడు. వస్తూనే భయభక్తులతో వంగి గురుదేవునకు నమస్కరించేడు.

“ఎవరునువ్వు?” ద్రోణుడు ప్రశ్నించేడు.

యువకుడు వినయంగా సమాధానంచెప్పేడు. “స్వామీ మేము శూద్రులం. నాతండ్రిపేరు హిరణ్యధన్వుడు. నా పేరు ఏకలవ్యుడు, యిక్కడకు సమీపంగా వున్న అరణ్యప్రాంతంలో మేము నివసిస్తున్నాము.”

“ఇలా ఎందుకువచ్చేవు?” ద్రోణుడు మరొకప్రశ్న వేసేడు. యువకుడు తలవంచి, చేతులుజోడించి, “స్వామీ, నాకు విలువిద్య నేర్చుకోవాలని ఆశగావుంది. అది తమవద్దనే నేర్చుకోవాలని ఉబలాటపడుతున్నాను. దయచేసి నన్ను తమశిష్యునిగా అంగీకరించమని ప్రాధేయపడుతున్నాను” అన్నాడు.

ద్రోణుడికి కోపంవచ్చి “అది క్షత్రియులకుమాత్రమే కులవృత్తి. జన్మతః శూద్రుడవైన నీకెందుకురా అది? మతవిద్రోహకచర్య లేవైనా తలపెడుతున్నావా, (దుర్మార్గుడా!)

“లేదుస్వామీ లేదు. అవేవీ నాకు తెలియవు. అది నేర్చుకోవాలనిమాత్రం నాకు ఆసక్తి కలిగింది. ఆ ఆసక్తే నన్ను ప్రేరేపించి తమవద్దకు తీసుకొనివచ్చింది” అన్నాడు ఏకలవ్యుడు.

శూరసేన అంగదేశాలలోని శూద్రులతో నీకేమైనా సంబంధబాంధవ్యాలున్నాయా” ఆచార్యుడు అనుమానంతో ప్రశ్నించేడు.

“లేదుస్వామీ లేదు. అక్కడివారి నెవరినీ నేనెరగను.”

“సరి, యింక వెళ్లు, నీఆసక్తిని చంపుకో. నీకులవృత్తిని ఆశ్రయించు-పో-మళ్లీ యీప్రక్కకు రాకూడదు; తెలిసిందా? గురుదేవుని ఆజ్ఞ విని, మరొకసారి నమస్కరించి యింటిముఖం పట్టేడు ఏకలవ్యుడు.

అతడు నడుస్తూ ఆలోచిస్తున్నాడు. ఆలోచిస్తూ నడుస్తున్నాడు. తను విలువిద్య నేర్చుకోవాలంటే అందరూ వద్దంటున్నారు. తన ఆసక్తి తెలియపరచినప్పుడు తనతల్లి తనను పిచ్చివాడంది. తండ్రి గదిమేడు గురువుగారు తనఆసక్తినే చంపుకోమన్నారు.

ఎందుచేతో తనకు సరిగ్గా బోధపడ్డంలేదు. ఎంతమంది ఎంతచెప్పినా తనకోరిక చావడంలేదు సరిగదా యింకా ఎక్కువవుతోంది. యింక ఎవరినీ అడగకూడదు. తనంతటతనే కృషి చెయ్యాలి. తను మంచివిలుకాడవాలి.

ఇలాంటి నిశ్చయంతోనే యిల్లు చేరేడు.

♦ ♦ ♦

ఆమరునాడే ఏకలవ్యుడు ఒక కార్యక్రమాన్ని నిర్ణయించుకున్నాడు. తనపల్లెకు దూరంగా ఒకఅనువైనచోటు చూచుకున్నాడు అక్కడ ఒకచెట్టుక్రింద తన గురుదేవుడైన ద్రోణాచార్యుని ప్రతిమను ప్రతిష్ఠించేడు. ఆ విగ్రహాన్నే తనగురువుగా భావించుకున్నాడు. భక్తితో ఆగురుమూర్తికి సాష్టాంగంగా నమస్కరించేడు. విల్లూ, అమ్ములూ సమకూర్చుకుని, సాధన ప్రారంభించేడు.

రాజకుమారులు సాధనచేసేచోటు తెలుసుకున్నాడు. తరుచు అక్కడికివెళ్లి వాళ్లకు కనపడకుండా దూరంగావుండి చూస్తున్నాడు. గురుదేవుని సాంకేతికాల ననుసరించి శిష్యులు చేసే సాధన క్రమాన్ని గమనిస్తున్నాడు. అవన్నీ ఆకళింపు చేసుకుని, తనచోటికి వచ్చి ఆప్రకారమే సాధన చేస్తున్నాడు.

అనుకున్న చోట తనబాణం తగిలినప్పుడు గురుమూర్తి వైపు చూస్తాడు. ఆవిగ్రహం తనను అభినందిస్తున్నట్టూ, ప్రోత్సహిస్తున్నట్టూ అనిపిస్తూంటుంది. ఉత్సాహంతోనూ దీక్షతోనూ సాధన సాగిస్తున్నాడు.

క్రమంగా అతనికి లక్ష్యంపై అచలితదృష్టి. లక్ష్యవేధిత్వమూ బాగా అలవడ్డాయి. అతడిప్పుడు చెట్లకొమ్మల్లోని కాయల్నీ, పరుగెడుతూన్న మృగాల్నీ, ఆకాశంలో ఎగురుతూన్న పక్షుల్నీ సులువుగా పడగొట్టగలడు. అంతేగాదు, మృగాలూ, పక్షులూ చేసే శబ్దాలు వింటూ వాటి ఉనికిని గ్రహించి కళ్లుమూసుకుని వాటిని పడగొట్టగలడు.

అతనికి ఎంత నేర్చుకున్నా యింకా నేర్చుకోవాలని వుంటోంది. తన గురుమూర్తి తనకింకా ప్రోత్సాహం యిస్తూన్నట్టూ, యింకా నూతన సంకేతాలందచేస్తున్నట్లూ అనిపిస్తూందతనికి. ఉత్సాహం ఎక్కువవుతోంది. దీక్ష ఎక్కువవుతోంది. యింటిదగ్గరనుంచి యింకా పెందరాళే వస్తున్నాడు. యింకా ఎక్కువసేపు సాధనచేస్తున్నాడు.

ఒకనాడు సాధనలో వుండగా తనవెనకాలనుంచి కిలకిలా నవ్వు వినిపించింది. వెనక్కి తిరిగిచూచేడు.

"అమ్మదొంగా" అంటూ చిన్ని పరుగెత్తుకు వచ్చింది ఎదురుగావెళ్లి, "యిలా ఎందుకు వచ్చేవు చిన్నీ" అన్నాడు అతని చేతిలో విల్లూ, బాణాలూ చూచి, "యిదేమిటి యిదికూడా నేర్చుకుంటున్నావా". అని అడిగింది చిన్ని.

"అవు"నన్నాడు.

"ఎప్పటినుంచీ"

"రెండుమాసాలు దాటింది"

"నాతో చెప్పనైనాలేదే"

"లేదుచిన్నీ, నేనిది నేర్చుకోడం ఎవరికీ యిష్టంలేదు అంచేత ఎవరికీ చెప్పకుండానే నేర్చుకుంటున్నాను. యీ సంగతి నువ్వు ఎవ్వరికీ చెప్పకూడదు తెలిసిందా" అన్నాడు. చిన్ని "చెప్పనులే-అని, "నువ్విప్పుడు పరుగెడుతూన్న జింకని భాణంతో కొట్టగలవా" అని అడిగింది.

"ఓ."

"ఎగిరే పిట్టల్ని ?"

"ఓ- కొట్టి చూపిస్తాను చూడు" అన్నాడు.

చిన్నికూడా ఆకాశంలోకి చూస్తోంది. ఏదో పక్షి ఎగురుతోంది. అతడు గురిచూచి బాణం వొదిలేడు. గిలాగిలా తన్నుకుంటూ పక్షి కిందపడింది.

చిన్ని ఆశ్చర్యపోతోంది.

ఇంతలో వేటకుక్క ఒకటి "భౌంమ్"మంటూ వచ్చి, వీళ్ళకేసి చూచి మొరుగుతోంది.

చిన్ని భయపడి అతని వెనకాల దాక్కుంది.

"భయంలేదు చిన్నీ, ఆకుక్క నోరు చూడు" అన్నాడు.

చిన్ని చూస్తోంది.

ఏకలవ్యుడి వింటిలోంచి ఒకబాణం వెళ్లి ఆకుక్కనోట్లో దూరింది. కుక్క మూల్గుతూ పారిపోయింది.

చిన్ని ఆశ్చర్యానికి మేరలేదు.

"చిన్నీ మరోమంచితమాషా చెయ్యనా ?"

"ఏమిటది ?"

"నువ్వు దూరంగా వెళ్లి పక్కకు తిరిగి కదలకుండా నుంచో, నాబాణం వచ్చి, నీసిగలోని పూలదండని ఊడదీస్తుంది."

"అయ్య బాబోయ్"

"ఏం"

"బాణం నాతలకి తగిలితే చచ్చిపోనూ ?"

ఏకలవ్యుడు నవ్వుతూ "తగలదుచిన్నీ" అన్నాడు.

"ఒకవేళ తగిలితే ?"

"తగిలితే వెంటనే నీతోబాటు నేనూ చచ్చిపోతాను సరేనా" అన్నాడు.

చిన్ని అదోలా చూస్తోంది.

ఏకలవ్యుడు ఒకబాణాన్ని వదిలేడు అది వెళ్లి దూరంగా నేలమీద గుచ్చుకుంది.

"చిన్నీ" నువ్వెళ్లి ఆబాణందగ్గర నుంచో" అన్నాడు. చిన్ని వెళ్లి నుంచుంది.

మరోబాణం వొదిలేడు. అది వెళ్లి చిన్నికి ఎదురుగా వున్న చెట్టుకొమ్మకు గుచ్చుకుంది.

"ఆచెట్టుమీది బాణంకేసి చూస్తూ నుంచో, చిన్నీ— కదలకూడదు" అన్నాడు.

చిన్ని కదలకుండా నుంచుని చెట్టుమీది బాణాన్ని చూస్తోంది.

రెండుక్షణాల్లో చిన్ని చెవివెనుకనుంచి ఒకబాణం దూసుకుపోయింది.

"అదుగో చిన్నీ, అలా పైకిచూడు" అన్నాడు.

చిన్ని పైకి చూచింది తనసిగలోని పూలదండ ఆకాశంలో విడిపోయి, నేలమీద పూలవాన కురుస్తోంది.

చిన్ని పరుగెత్తుకుంటూవచ్చి "ఎంతవాడవయ్యేవు, ఏకలవ్యా ?" అంటూ కౌగలించుకుంది. వెంటనే అతన్ని వొదిలేసి భయంతో అతనివెనుక దాక్కుంది. "అదేమిటి అలా దాక్కుంటున్నావు "చిన్నీ" అన్నాడు. చిన్ని ఎవరినో చూచి భయపడుతోంది నెమ్మదిగా చెపుతోంది.

"అయనెవరు ఏకలవ్యా, ఆచెట్టువెనకాల నుంచుని మన్ని చూస్తున్నాడు, అలాచూడు" అంది.

ఏకలవ్యుడు అవైపు చూచేడు.

ఒకరాజకుమారుడు యిందాకటి కుక్కను వెంటబెట్టుకుని వచ్చి, తనఎదురుగా నిలబడ్డాడు.

"నాకుక్క నోట్లో బాణంవేసినవాడవు నువ్వేనా" అంటూ కోపంగా అడిగేడు రాజకుమారుడు.

"అవును" నేనే అన్నాడు, ధీమాగా ఏకలవ్యుడు.

రాజకుమారుడికి కోపం ఎక్కువయింది. "నేనెవరినో తెలుసా" అని అడిగేడు.

"తెలియనక్కరలేదు. నన్నుఎదుర్కోదలచిన ఏకుక్కకయినా సరే ఆశాస్తే జరుగుతుంది."

ఏకలవ్యుడి జవాబు అర్జునుడి హృదయానికి బాణంలా తగిలింది.

"నేను ద్రోణాచార్యుల ప్రియశిష్యుణ్ణి–పాండవ మధ్యముణ్ణి."

ఏకలవ్యుడికి నవ్వొచ్చింది. "ఆద్రోణాచార్యులే నాకూ గురుదేవులు" అన్నాడు.

"ఆ! నిజంగానా?" ఆశ్చర్యంతోనూ, అసూయతోనూ, అనుమానంతోనూ, అడిగేడు అర్జునుడు.

ఏకలవ్యుడు "ఆ, నిజంగానే" అన్నాడు.

అర్జునుడికి మతిపోయినట్లయింది. తనకి మించిన విలుకాడు యీలోకంలోవుండడం తనకేదో బాధగావుంది. తనబాధ తనగురుదేవులకు చెప్పాలి. చెప్పేవరకూ తనమనస్సు స్తిమితపడేట్టు లేదు.

ఉన్నట్టుండి తటాలున వెనక్కి తిరిగి గబగబా నడిచి వెళ్లిపోతున్నాడు అర్జునుడు. అతనివెనకాలే కుక్క పరుగెడుతోంది.

చిన్నీ ఏకలవ్యుడూ పక్కన నవ్వేరు. అలా నవ్వు కుంటూనే యింటికి వెళ్లిపోయేరు.

♦ ♦ ♦

"ఏకలవ్యా, నేను అడివికి వెడుతున్నాను, కట్టెల కోసం, నువ్వూ వస్తావా?" అని అడిగింది చిన్ని, మర్నాడు పొద్దున్నే వచ్చి.

"ఇదిగో నేనూ బయలుదేరుతున్నానుగా" అంటూ గుడిసెలోంచి బయటికి వచ్చేడు ఏకలవ్యుడు.

ఈమాటలు అతనితల్లి వింది. "ఇంకా సరిగ్గా తెల్లారకుండా యిప్పుడే ఎందుకురా అడివికి?" అంది.

"తొందరగానే వచ్చేస్తాంలే అమ్మా, చిన్నికూడా వస్తోంది."

"ఏంతొందరగా రావడమో, రోజూ యిలాగే అంటు న్నావు - సరేగానీ, వచ్చేటప్పుడు కట్టెలు పట్టుకురా" అంది తల్లి.

"ఓ, పట్టుకొస్తా" అంటూ మళ్లీ లోపలికి వెళ్లి, తన చిన్నచేతిగొడ్డలి మొల్లో దోపుకుని, బయటికి వచ్చేడు. "రా, చిన్నీ పోదాం" అన్నాడు. యిద్దరూ నడుస్తున్నారు.

"నేను బాణాలు వెయ్యడం నేర్చుకుంటున్నానని నువ్వు ఎవరికీ చెప్పలేదుగదా" నెమ్మదిగా అడిగేడు ఏకలవ్యుడు.

"ఎందుకు చెపుతాను? నువ్వు చెప్పొద్దన్నావుగా."

"అవునవును; నాకు తెలుసునులే, నువ్వు చాలా మంచి పిల్లవని."

"చాల్లే - ఊరుకో - నన్నేమీ పొగడక్కరలేదు."

"ఏం? కోపం వచ్చిందా? యివాళ నీకోజింకను కొట్టి యిస్తానులే, సరేనా?"

"జింకని కాదుగాని, ఏకలవ్యా, యివాళ నేనొక దాన్ని కొట్టమంటాను, నువ్వు కొట్టలేకపోతావు."

"దేన్ని కొట్టమంటావు?"

"నడు - చెపుతాను. యివ్వాళ నువ్వెలాగూ ఓడి పోతావులే."

"నేను ఎప్పుడూ ఓడిపోను."

"చూద్దాంగా!"

"చూద్దాంగా!"

నడుస్తూ నడుస్తూ చటుక్కున ఆగింది చిన్ని. "అదేం" అన్నాడు ఏకలవ్యుడు.

"అదుగో అలా చూడు, అడివిలోంచి ఎవరో కొత్త వాళ్లు వస్తున్నారు. అంతమంది వొస్తున్నారేమిటీ?"

ఏకలవ్యుడు పరకాయించి చూచేడు. నిజంగా చాలా మందే వస్తున్నారు. తొందరగానే వస్తున్నారు. క్రమంగా గుంపు దగ్గర పడుతోంది. అందులో అందరికన్నా ముందు హుందాగా నడుస్తున్న వ్యక్తి ద్రోణాచార్యులని ఏకలవ్యుడికి తెలిసింది. ఆయన వెనకాల వస్తున్నవారు రాజకుమారులూ, నగరవాసులూను.

వాళ్ళు బాగా దగ్గరగా వస్తూన్నకొద్దీ, చిన్నికి సిగ్గూ, భయమూ ఎక్కువవుతున్నాయి. "యింటికి పోదాంరా ఏకలవ్యా" అంటోంది. ఏకలవ్యుడు వినిపించుకోడం లేదు. ఆ గుంపులో అర్జునుడు కూడా కనిపించేడు. అతడు తన వేపే వేలుపెట్టి చూపిస్తూ, గురుదేవులతో ఏదో చెపుతున్నాడు.

గుంపు దగ్గరకు వచ్చేసింది. ఏకలవ్యుడు భక్తిప్రపత్తులతో తనగురుదేవులకు నమస్కరించేడు.

"నీ పేరు ఏకలవ్యుడు కదూ?" ద్రోణుడు ప్రశ్నించేడు.

"అవును స్వామీ."

"ఆ పల్లెలోనేనా నువ్వు ఉంటున్నది?"

"అవును స్వామీ, అదిగో అక్కడ రెండు బండరాళ్లు కనిపిస్తున్నాయే - అదే మా గుడిసె."

"నడు. అక్కడికి వెడదాం" అంటూ ద్రోణుడు పల్లె వైపు దారితీసేడు. అందరూ ఆయన్ని అనుసరించేరు.

చిన్ని ముందుగానే పరుగెత్తి వెళ్ళిపోయింది.

పల్లెలో సంచలనం కలిగింది. బ్రాహ్మణులూ, రాజకుమారులూ ఆ పల్లెపట్టుకు ఎప్పుడూ రారు. యివాళ ఎందుకు వచ్చేరో ఎవరికీ తెలియడంలేదు. అందరికీ ఆశ్చర్యంగానూ, భయంగానూ వుంది. కొద్దిక్షణాల్లో పల్లెజనం అందరూ హిరణ్యధనువు గుడిసెముందు మూగేరు.

ద్రోణుడు ఒకబండరాతిమీద కూర్చున్నాడు. ఆయన ఎదురుగా చేతులుకట్టుకుని పల్లెజనం అర్ధచంద్రాకృతిలో నిలబడ్డారు. రాజకుమారులూ, నగరవాసులూ ఆయన వెనక వైపు నుంచున్నారు. ఆయననోట్లోంచి ఏమొస్తుందోనని కుతూహలంతోనూ, భయంతోనూ అందరూ నిశ్శబ్దంగా వున్నారు.

"ఏకలవ్యా!"

"స్వామీ!"

"నువ్విలా కొంచెం ముందుకి రా."

ఏకలవ్యుడు ముందుకి వెళ్ళి ద్రోణాచార్యులకు ఎదురుగా నిలబడ్డాడు.

"నువ్వు విలువిద్య నేర్చుకుంటున్నావు కదూ."

"ఔను స్వామీ."

"నీకు గురువు ఎవరు?"

"మీరే స్వామీ."

"నేనా? అబద్ధం చెప్పకు. నిజం చెప్పు."

"నిజమే చెపుతున్నాను. మీరు నాకు స్వయంగా నేర్పకపోయినా మీరే నాకు గురుదేవులు."

పల్లెజనం ఆశ్చర్యపోతున్నారు. హిరణ్యధనువు దంపతుల మొహాల్లో భయం ఆవరించింది. అర్జునుడు ద్రోణునివైపు అదోలా చూస్తున్నాడు.

"సరే, ఏకలవ్యా, నేను నీకు గురువునుకదా! మరి నాకు గురుదక్షిణ?"

ఏకలవ్యుడిమొహం సంతోషంతో వికసించింది. ద్రోణాచార్యులు తనను శిష్యునిగా అంగీకరించేరు. గురుదక్షిణ కూడా అడుగుతున్నారు. తను ఎంత అదృష్టవంతుడు! తను విలుకాడవడం అందులోనూ, ద్రోణాచార్యులవారి శిష్యుడని అనిపించుకోవడం అదృష్టంకదూ. తన కోరికలు నెరవేరేయి. యిప్పుడింక తన గురుదేవుని కోరికకూడా చెల్లించి, తనజన్మ సార్థకపర్చుకోవాలి.

"స్వామీ, మీరు ఏది కోరితే అది గురుదక్షిణగా సమర్పించుకుంటాను. నాశరీరమైనా, నాప్రాణమయినా. ఏదైనా సరే."

"ఆ! ఆ! తొందరపడకు ఏకలవ్యా, బాగా ఆలోచించుకుని చెప్పు" అన్నారు గురుదేవులు.

"ఆలోచించుకునే చెపుతున్నాను గురుదేవా, మీ కోరిక ఏదైనా సరే. సంతోషంగా చెల్లించుకుంటాను."

"అయితేవిను. నాకు కావలసింది నీ కుడిచేతి బొటన వ్రేలు." యీమాట వినగానే అందరి గుండెలూ ఝల్లుమన్నాయి. ఏకలవ్యుడి హృదయంలో మాత్రం ఆనందం పొంగి పొరలెత్తింది. తన గురుదేవులు చాలా మంచివారు. వారు కోరిందికూడా చాలా చిన్నకోరికే. అది తను వెంటనే చెల్లించుకోగలడు కూడాను.

భక్తితో వంగి, గురుపాదాభివందనం చేసి, "మీరు కోరిన గురుదక్షిణ యిప్పుడే సమర్పించుకుంటున్నాను; స్వీకరించండి" అన్నాడు. అందరూ నిశ్చేష్టులై చూస్తున్నారు.

అక్కడే వున్న బండరాయిమీద తనకుడిచేతి బొటన వ్రేలు ఆన్చేడు. మొలలోవున్న చిన్న గొడ్డలిని ఎడం చేత్తో తీసి పైకి ఎత్తేడు.

"వద్దు, ఏకలవ్యా, వద్దు" అంటూ చిన్ని పరుగుత్తుకుంటూవచ్చి అతని ఎడంచెయ్యి పట్టుకుంది.

"వొదులు చిన్నీ, చెయ్యి వొదిలెయ్" అన్నాడు ఏకలవ్యుడు కోపంగా. చిన్ని వొదిలేసి, ఆ దృశ్యం చూడలేక రెండుచేతులతోనూ మొహం కప్పుకుని ఏడుస్తోంది.

ఏకలవ్యుడి ఎడంచెయ్యి క్రిందికి దిగింది. 'టక్' మన్న శబ్దంతో శిష్యోత్తముని దక్షిణ కరాంగుష్టం గురూత్తముని పాదాలముందు వ్రాలింది. అర్జునుడి మొహంమీద సంతృప్తి తాండవించింది. ఆచార్యులవారివదనం మీద చిరునవ్వు చిందులు తొక్కింది. ఆనాటి సాంఘికవ్యవస్థకు ఒక గండం గడిచింది.



# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the month of February 1961.

**OUT-PATIENT REGISTER:—**

| | | |
|---|---|---|
| | No. of Surgical cases treated | 42 |
| | „ „ Medical „ „ | 632 |
| | „ „ Ante-natal „ „ | 210 |
| | „ „ Post-natal „ „ | 55 |
| | „ „ Gyneac „ „ | 101 |
| | „ „ E.E.N.T. „ „ | 33 |
| | „ „ Dental „ „ | 3 |
| Total | „ „ New Patients | 1,076 |
| | „ „ Old Patients | 828 |
| | Grand Total | 1,904 |

**ADMISSION REGISTER:—**

| | |
|---|---|
| No. of Patients admitted for Normal Deliveries | 102 |
| „ „ „ „ Abnormal Forceps 9 } Breech 3 } | 12 |
| „ „ Ante-natal cases c False Pains | 20 |
| „ „ Ante-natal cases e Toxeamia | 1 |
| „ „ Gyneac cases | 19 |
| „ „ Surgical cases treated | 3 |
| „ „ Medical „ | 12 |
| „ „ Babies admitted as Lodgers | 110 |
| Total | 279 |

(True Copy)

(Sd.) Dr. K. R. AMBUJA,
*R.M.O.*

Sd.) Dr. M. PAVANA BAI,
*Medical Superintendent.*

(Sd.) Smt. V. LAKSHMI PARVATHI
*Secretary.*

# "ఆవేదన"

ఎస్. ఎన్. బేగం. జి. యస్.

మేము చేస్తున్నది సాంఘికసేవ. ఆమధ్య ఒకసాంఘిక వుపయోగార్థం కొంతడబ్బు చందాలుగా వసూలు చేద్దామని నేనూ నాతో పనిచేసే లలిత, రాజేశ్వరి ముగ్గురమూ బయలుదేరి ఆదర్శపురం అనే గ్రామం వెళ్ళాము. ఆ పురంలో చందాలు యివ్వగలవారు, వున్నంతలో వుదారులు యెవరూ అని విచారించగా, కొందరిపేర్లతో పాటు, అక్కడే కొంతకాలంగా, స్థిరంగావుండి సంఘసేవికగా పనిచేస్తుండిన కరుణమ్మ అనే ఒకామె పేరు కూడా చెప్పి, పాపం ఆమె 15 రోజులనుండి అనారోగ్యంతో బాధపడుతుంది, చాల మంచి ఆమె, వాళ్ళ బంధువులుకూడా యెవరూ రావడంలేదు, పోవడంలేదు. యెప్పుడన్నా దూరపు బంధువులనో, స్నేహితులనో మాత్రం వచ్చి పోయేవారు. మరీ నాలుగు రోజులనుండి చాల నీరసించిపోయింది. మంచంమీదనుండి కూడా లేవలేకపోతూవుంది. యిదిగో యిల్లు యిక్కడికి దగ్గరిలోనే మావాడకట్టులో ఆ కడనున్నది. నిన్నటినుండి ధోరణి కూడా మారిందమ్మా! యేదేదో మాట్లాడుతుంటుంది అని చెప్పారు. సాంఘికసేవకులంగదూ, ప్రాణమూరుకుంటుందా! అన్నిరకాల ఆపదలకు అడ్డుపడడమే మా విధికదా! ఆ వుద్దేశ్యంతోనే కరుణమ్మను చూడడానికి, పరిస్థితులు తెలుసుకోవడానికీ కరుణమ్మ యింటికెళ్ళాము. మాతోపాటు అక్కడివారు కూడా అరడజనుమంది తయారయినారు. మేమందరంకూడా ఆమెకెదురుగనే కూర్చొని పలుకరించుచూ, పూరడించాము. కరుణమ్మ కూడా వుచితరీతంగా సమాధానాలు చెప్పింది. అయితే ఆమె చెప్పే ప్రతిసమాధానంలోనూ, ఆమెయొక్క ప్రతి మాటవెనుకనూ, అందుకోలేనన్ని భావాలు యిమిడివున్నట్లనిపించింది. ఆమెయొక్క ప్రతిపలుకులోనూ, గతం, విశ్వాసం, ప్రేమ, అభిమానం, దైవభక్తి, చింతన, కలవరం ద్యోతకమయినవి. ఇలా వింటూనే వున్నాం, యింతలో కరుణమ్మ నవనాడులలోని శక్తినంతా కూడగట్టుకొని, గత శృతా, స్మృతులన్నీ వుపన్యాసధోరణిలో నిట్టూర్పులతో, నిరాశలతో యీ క్రిందివిధంగా యెంతో మందిని సంబోధించుకుంటూ మాట్లాడదొడగింది.

"ఇది దూరమయిన అసంఖ్యాక స్నేహితులవల్ల నాలో కలిగిన మానసికబడబాగ్ని భస్మమో! మతిభ్రమణమో! జేమహోమమో! ప్రజ్వలిత వేదనామాత్రమో! అంత్యసూచనో! ఏమిటో! మీ అందరికీ తెలుసు ఇవి. నేను విశాలదక్షిణాపథంలో ఒక పల్లెటూరిలో, సర్కారు వారితరపున చిన్ననౌఖరీ చేసికొంటూ, వూరిచివర పూరింటిలో మిణుకుమిణుకుమంటూ యేకాకిగా జీవితాన్ని గడుపుతున్న రోజులు. కాయం అస్వస్థలకు నిలయమైపోయింది. బాధపడుతున్నాను. ఇలాంటివి యెన్ని కష్టాలొచ్చినా పూరడించేవారైనా లేక ఒంటరిగా మాత్రమే మిగిలిపోతున్నాను. దుఃఖంలో యేకాంతసేవ అనుభవించుచున్నాను. పర్యవసానం, నావాళ్ళు, స్నేహితులు అనుకొన్నవారందరూ జ్ఞాపకం రావడం, కన్నీరు మున్నీరుగా యేడ్చిన గుర్తులే మిగులుతున్నాయి. హృదయానికి బాధలచెద పట్టింది. ఏవిధంగానూ వుపశమనం లేదు. శాంతి లభించడం లేదు. కల్లోలపరిస్థితుల తరంగాలతో నురగలు గ్రక్కుతున్నది; మార్గం తెలియదు. ఒక్కొక్కరు యెలా దూరమయిపోయారో!

అమ్మా! అన్న నాలుగేండ్లవాడై యుండగా. నేను పుట్టినతర్వాత కొద్దినెలలకే మానాన్న చనిపోయినా, ఆయన చనిపోయేనాటికి, ఆయన సంపాదించిన స్థిర, చరాస్థులేమీ లేకపోయినా, నీచెమటనోడ్చి, కష్టపడి మా యిద్దరినీ పెద్దవాళ్ళనుచేసి, మా బ్రతుకు తెరువులకు దీవనలిచ్చిన. నా తరతరాల బంగారపు అమ్మా! నిన్ను, నా మనసుతో, నా కండ్లముందు యెల్లప్పటికీ ప్రతిష్ఠించుకొంటున్నాను. నీవు వృద్ధురాలవు. భగవంతుడు తన విధిగా నీకే వృద్ధాప్యం, కష్టాలుకూడా ప్రాప్తింపజేశాడు. మన ఆర్థికపరిస్థితులనుబట్టి, ప్రత్యేకించి నా జీవితాన్ని బట్టి, నేను మీవద్దకు రావాలన్నా, మీరు నావద్దకు రావాలన్నా, సమాజానికీ వెరిచి రాలేకున్నాము, పోలేకున్నాము. నా పదకొండు నెలల ప్రాయపు శైశవదశలో, మా నాన్న చనిపోయినతర్వాత, మేము పెరిగి పెద్దవారమై, నీకు కుడి, యెడమ భుజాలవుతామనుకున్న అన్నా నేనే. నీకు తీరని సమస్యగా తయారయినాము. నాన్న లేనిలోటుగా, నీకు నీ బంధువులవలన కలిగిన కష్టాలు సహించలేక, స్వస్థలాన్ని విడిచిన కాందిశీకినివై, సీతాకాలంలో ఒకనాటి అమావాస్య అర్ధరాత్రివేళ, నాలుగు సంవత్సరాల అన్నను చేత్తో పట్టుకొని పదకొండు నెలల నన్ను హృదయానికి హత్తుకొని, కిర్రుబెడుతున్న జొన్నచేల మధ్యగా పయనించి, నల్ల తుమ్మలనాయుడు తోపులో,

కోనేటివద్దకు చేరి, ముందుగా నన్నూ, అన్నయ్యనూ ఆతతాకానికి అర్పించి, తర్వాత నీవూ బలి అవుదామన్న ప్రయత్నపు ఆఖరిక్షణంలో వున్నప్పుడు, ఆ అర్ధరాత్రి వేళ యెవరో తాత వచ్చి, నీ హృదయ పరికితనానికి ధైర్యం కలిగించి, మూడురోజుల దారిభత్యం యిచ్చి, మన ముగ్గురినీ కాపాడాడని నీవు చెప్పినమాటలు జ్ఞాపకం వచ్చినపుడంతా, ఆనందభాష్పాల, అనుభూతుల అశ్రుకణాల టపటపలను అద్దుకుంటూ, నీ తియ్యని, చల్లని హృదయంలో నాకు తెలియకుండానే జొరబడిపోయి, ముప్పిరిగొన్న ఆనందంతో, తెలియని తన్మయత్వాన్ని పొందుతుంటాను. అప్రయత్నంగానే కన్నీరు కంపింపజేస్తుంది. నీ కష్టార్జితమై వున్న ఒక్క పూరిగుడిశా మా యిద్దరికొఱకే విక్రయించావు. మన పేదరికములోనే మా యిద్దరినీ కడతేర్చావు. తర్వాత నేనెట్టి స్థితిలో వుంటూవచ్చినా, నా విధిగా భావించి, ధర్మం తప్పకుండా, నా మనస్ఫూర్తిగా నీ ఖర్చులకు నా శక్తున్నంతవరకూ, పదో, పాతికో నీకు పంపగలుగుతున్నందుకు భగవానుడు నాకు ఆ మాత్రమైనా మంచిమనసు యిచ్చినందుకు కొంతవరకు మాత్రం సంతృప్తిని పొందకలుగుతున్నాను. అమ్మా! నా యీ అనారోగ్యపరిస్థితిలో రాలేకపోయినా, అవకాశమున్నప్పుడంతా, నేను నీ సేవచేసి, నా హృదయకుహరంలో నిన్నారాధించగలగాలని నన్ను ఆశీర్వదించు. తల్లిదండ్రులే దైవముగదా! నేను సంఘానికి దూరంగా వుండవలసిన వ్యక్తినే అయినా, నా హృదయాన్నిమాత్రం నిశ్చింతగా వుంచి, నిన్ను కాపాడమని దేవుని ప్రార్థించుచున్నాను. బిడ్డగా నీ ఋణం యెన్నిజన్మలకు తీర్చుకోగలుగుతానో! నీకు సేవచేసి యెప్పటికి తరించుతానో! అమ్మా, యెక్కడున్నా నన్ను ఆశీర్వదించుచుండు. నీ చలువే నా ఆయుస్సు, నీ ప్రేమే నా ఆత్మ.

ఈ నా వయస్సు మధ్యకాలములో నాకు మరొక అమ్మగా కలసి, గారాబుగా కాపాడి, యిప్పుడు మనసు విరుచుకొన్న స్నేహమయీ! ఒక్కసారి నా దీనావస్థను అర్థంచేసికో. మనస్నేహాన్ని, స్నేహకాలాన్ని, పరిస్థితులను జ్ఞాపకంచేసికో. గడచిన నా జీవితంలో, సగం జీవితాన్ని నీకే ధారపోశాను. నల్లమలకొండల్లో నాకు 40 రూపాయల జీతమప్పుడుకూడా, రక్తాన్ని చెమటగా కార్చి, పతనమవుతున్న నీ జీవితాన్ని వుద్ధరించాను. నీ కోసం వీరచిరుతలో అజ్ఞాతవాసం చేశాను. నీవు మహా విజ్ఞురాలవని, నేను అర్ధాకలితోకూడా పస్తులుండి నీ బొజ్జను, నీ హోదాను పెంచాను. సాటివారిలో సెబాస్ అనిపించాను. నన్ను పెంచుకొంటున్న ఒక అమృతమూర్తిగా భావించాను. నేనెక్కడున్నా, నీ పేరు, నిన్ను తలంచినంతనే బహుభయభక్తులతో, సవినయంగా, అనిర్వచనీయమైన అనుభూతులతో, అరమోడ్పులతో, స్తుతించి స్మరించేదానను. నా సర్వస్వం నీవుగా భావించి ఆచరించాను. నన్ను నమ్మినందుకు యెలాగైనా నిన్ను కడతేర్చాలనుకున్నాను. కాని యీనాడు, నీవు, నిన్ను ఒక జమీందారిణిగా భావించుచున్నావు. నీవెతల జీవితాన్ని విస్మరించావు. నేను నీ దృష్టిలో దూరంలేక పడిపోయిన గాలిపటంలా కనబడుతున్నాను. నీ చూపంతా యీనాడు వుత్తుంగఅంతరరాలమీదనేగాని, నాలాంటి నిరుపేదమీద కాదు. ఈనాటి నీ సంపాదన మన సువర్ణస్నేహపంజరాన్నే దగ్ధంచేసింది. ఆనాడు నీ కష్టాలలో లేని బంధువులు, యీనాటి నీ కలిమిపరిస్థితులకు కనుగీటగానే, నీ హృదయాన్ని నాకు కనుమాటు చేయగలుగుచున్నావు. ఎప్పటికైనా, యెంతటిదైనా, నీ ఐశ్వర్యాన్ని, నీ దారిద్ర్యాన్నిబట్టి కాక, స్నేహంకొఱకే స్నేహంచేశానని నీకెందుకు జ్ఞాపకం రావడంలేదో! నా యీ స్థితిలోకూడా నీకు నాలుగు జాబులు వ్రాశానే, ఒక్కసారి వచ్చి చూచివెళ్ళలేక పోయినావు.

నేను మీ యింటిముందుగా, రాచబాటపై కళాశాలకు పోతున్న రోజుల్లో నన్ను నిలవేసి ప్రయాస సేదదీర్చి, మీయింటి ప్రక్క చెఱువుయొక్క చల్లని చిఱుగాలులతో ఆహ్వానించి నివాళులిచ్చిన రోజులవి. అప్పటి నీ హృదయం మంచిది కనుక తర్వాత అనతికాలంలోనే మనవి తల్లీపిల్లల హృదయాలయినవి. అప్పటికే దురభ్యాసాలకు లోనయియున్న నీ భర్త నిన్ను నానా బాధలు పెడుతూ, నీ మాంగల్యంతోసహా అమ్ముకొన్న తర్వాత, విషప్రయోగంద్వారా, నీవు ఆత్మహత్య చేసికొందామన్న ప్రయత్నంలో ఉండి, నీభర్త యింటలేని రోజున ఒకనాటిరేయి 12 గంటలవేళ, నిదురించుచున్న నా మోముతో ముచ్చటలు పడి, నా గడ్డం పట్టుకొని, తల నిమురుతూ, నీ హృదయాన్ని నాకప్పగించి, చెప్పవలసినవన్నీ చెప్పి, కడసారిగా నన్నొకసారి చుంబించి, నన్ను మరచిపో అంటూ విలవిల దుఃఖించావు. పరిస్థితులను తెలిసికొని, నీనుండి ఆ విషమును లాక్కొని అప్పటికీ, తర్వాత యెప్పటికీ నిన్నే రక్షించగలిగాను. నా సర్వశక్తులు ధారపోసి నిన్ను బ్రతికించి, సమాజంలో నాగరికురాలిగా చేయగలిగాను. నీ జీవితంకోసమే నా శాశ్వత సుఖానికికూడా దూరమయ్యాను. నీభర్త చెడు ప్రవర్తనవల్ల, అంతకుమిందే నీ ఆస్తి సర్వస్వమూ హరించిపోయింది. దురదృష్టమువల్ల నీ యిద్దరు బిడ్డలు

మరణించారు. తర్వాత నీ కుటుంబవ్యక్తులు, నీవు, నేను, నీభర్త యీ ముగ్గురమే అయినాము. నీవు చేసిన పూజలకు, నీభర్తపట్ల నీవు చూపిన ఓర్పుకు ఫలితమా అన్నట్లు నీవట్లయినవగజ్జలతల్లి తాండవఫలితంగా, నీ భర్త వ్యాధిగ్రస్తుడై అనతికాలంలోనే మరణించాడు. నీవు నీభర్తశవంపైబడి, నీ పరిస్థితులు, నీ భవిష్యత్తు తలంచుకొని ప్రాణాలు కడబట్టేవరకు శోకించావు. నాకూ దుఃఖం ఆగలేదు. అక్కడ నలుగురూ నీచెంత జేరి, కన్నవాళ్ళను దక్కించుకోలేకపోయినా, కనని బిడ్డను నీకు భగవంతుడు చూపెట్టాడు. లే. నీవు అధైర్య పడకు అన్నారు. ఆవెంటనే నీవు నాకంఠాన్ని చుట్టుకొని నీవే నాకు దిక్కు అనే పలుకులతో యేడ్చుచూ, నా హృదయంలో చెదరని నియమాలను ధరింపజేశావు. తర్వాత ఒకసారి నాకు చాల జబ్బుచేసినప్పుడు, కన్నీరు మున్నీరుగా యేడుస్తూ, రాత్రింబవళ్ల మేల్కొని, నా ముఖంలో ముఖందూర్చి, నీవు లేకపోతే నేనూ ఆయనతోనే పోయేదాన్ని. నీమీద మమతే నన్ను బ్రతికించింది. దేవుడు నిన్నుకూడా నాకు దూరంచేస్తాడా! వద్దు, నీవు త్వరగా కోలుకోవాలి, నీవు సుఖంగా వుండాలి. నిన్ను నేను యెప్పటికీ చూడాలి అని దీవించి కాపాడావు. కాని యీనాడు నీజాడే తెలియనివ్వవు. జాబువ్రాస్తే జవాబే వ్రాయవు. నీవు యేపరిస్థితుల్లో వున్నా, నీ ముఖం నేను చూడను అని ప్రమాణం చేసికొన్నట్లుగా కఠినత వహించావు. వాటిఫలితమే యీనాటి నా యీవ్యధలు, వేదనలు.

ఒకప్పుడు తియ్యని, నిర్మలమైన మనసులు, హాయైన మమతలు పవిత్రభావాలు గలిగియుండి, యీ నాస్థితిలో యిప్పుడు అకారణంగా దూరమయిన స్నేహితులారా! నామీద యెందుకింత పగబూనారు. మీకు నేనేమీ ద్రోహంచేయలేదే! జ్ఞాపకమున్నంతవరకు మీ అందరికీ మేలే చేశాను. నావల్ల యేదైనా పొరపాటు జరిగియుంటే, స్నేహంలో మీరెంత కఠినశిక్ష విధించినా అనుభవించియుండేదాన్ని. కారణసహితంగా దూరం చేస్తే, మీ వూసికే వచ్చేదాన్ని కాదు. ఏది యేమైనా, మీ విషయాలు నాకు తెలియజెయ్యకుండా, నా విషయాలు మీరు తెలుసుకోకుండా, యిలా ముభావంగా వుండడం మీకు ధర్మమా! మనసిచ్చి స్నేహం చేయడంలో యేమైనా అపకారాలు మీకు కనబడుతున్నాయా ఎవరికెలా యున్నా నాకుమాత్రం దూరమవుతున్న యీ నిలకడ లేని స్నేహితులవల్ల, నిజాయితీ లేని స్నేహితులవల్ల ప్రాణాపాయంగానే యున్నది. ప్రపంచంలో యెవరికెవరూ లేరు. యెవరికి వారే అన్న వేదాంతసూత్రాన్ని నిజమని నిరూపించేందుకొన్నట్లు మీరందరూ యిలా దూరమయి పోతున్నారు. ప్రస్తుత నా జీవితంలో, మనస్సులో రచించుకొన్న నీతిప్రకారం నన్నాదరించే వాళ్ళు, ప్రేమించేవాళ్లు అందరూ వున్నారని సంతోషించలేను, యెవ్వరూ లేరని విచారించుకోలేకుండా యున్నాను. ప్రతిఘటన నా మనసులో కలకాలం కాపురముంటాయని జ్ఞాపకం పెట్టుకోండి. ప్రాణస్నేహితులు అనుకొన్నవారి మీ ముభావాలకు కారణమేమిటో తెలియక విచారించడమే కాకుండా, మనస్సు తికమకలతో, అది శాంతిపడుటకు, మనిషికి పిచ్చెత్తి, మతిలేకుండా పోవాలో, బాధలు తెలియకుండా హృదయాన్ని కరగదియ్యాలో బోధపడుటలేదు. అన్నిటికంటే మతిభ్రమణమే బాగుంటుంది. స్నేహాలవల్ల జరిగే చిత్రహింసలెన్నో గమనించండి. పాతగురుతులు యేమాత్రమూ లేకుండా పోవడానికి పెద్ద పిచ్చి పూర్తిపిచ్చి యెక్కిపోవాలి. ఆ పిచ్చిలోనన్నా మనసుకు తేలికతనం దొరుకుతుంది. నా స్నేహితులు నన్ను దూరంచేశారే అన్న బాధలేకుండా, జీవితానికి అంత్యకాల చిహ్నాలయిన విపరీతవాగుడు, నవ్వు, కలిగి, ఆకలిదప్పులు తెలియక యీ లోకంనుండే తప్పుకోవచ్చు. అందుకనే మతిలేకుండా పోతే మరణమన్నా భయంవుండదు, ప్రాణమన్నా తీపివుండదు.

ఇంకా చూడు సుమనా. ఒకన్నాటి మనిద్దరి అనతిదూర ప్రయాణంలో ఒక పెద్దకాలువవొడ్డున కూర్చొని యిక ముందు యవ్వనజీవితంలో నీవేమి చేస్తావంటే నీవేమి చేస్తావని సమాధానాలు పొందాము. ఆతర్వాత నా జీవిత ప్రతిమార్పు నీకు తెలియజేస్తూ వచ్చాను. నీవు నాకిచ్చిన ప్రమాణాలు నిలుపుకోలేదు సరిగదా, నా లేఖలకు ఒక్కదానికీ జవాబు వ్రాయలేదు. మనిద్దరం కలసి కమలా నోబుల్ హాస్టల్లో వుంటున్న రోజుల్లో, ఒకనాటి రాత్రి 9 గంటలకు, మనిద్దరం కూర్చొని నీవు టెర్రరిస్టవంటే, నీవు సోషలిస్టువని చాలసేపు వాదించుకొని, ఆఖరికి మన ప్రిన్సిపాల్‌గారి గదిలోని 40 కాండిల్సు బలుబును కోటి బల్బుల కాంతిగా భావించుకొని చంద్రుడు, వెన్నెల భూమ్యాకాశాల సాక్షిగా, మన కే యిజమూవద్దు, మనం శాంతిప్రియులుగానే సేవలు చేద్దాం, మనస్నేహాలుకూడా యిలాగే వర్ధిల్లాలి, మనమెప్పుడూ విడివడద్దని ప్రమాణాలు చేసికొన్నామే! నీకవైనా జ్ఞాపకం రావడంలేదా! భగవంతుడేదో పరీక్షకోసమన్నట్లు, నీ ఆరోగ్యం చెడిపోయి, నీవు బళ్ళారి టి. బి. ఆస్పత్రిలో బెడ్‌నంబరు 12 లో వున్నప్పుడు మిత్రత్వంలో నా ధర్మాన్ని నేను నెరవేర్చినందుకు, నా యీస్థితిలో అందరూ భయపడి

దూరమయినారు. నన్ను చచ్చిన మనిషిక్రింద లెఖ్ఖవేసి కొన్నారు. కాని నా హృదయంలో హృదయంగా అన్ని విధాలా అన్నింటికీ నీవే మిగిలి, నన్ను బ్రతికించావని నన్ను స్తుతించావు. అవన్నీ గతజలసేతు బంధనంగా భావించి నన్నుమరచావా. మరొకసారి మనకుర్రతనపు అభ్యుదయ భావాల ఆచరణవల్ల నీ వుద్యోగం పోయినప్పుడు కొన్ని ప్రశాంత, పవిత్ర వాగ్దానాలకు అపచారం చేసినందువల్లనే నా కీపరిస్థితి కలిగింది. నీకు పెట్టని సొమ్ములుగా వుండి, నిన్ను కాపాడుతున్న నీ ఓర్పు, నీ చెలిమి, నీ శాంతము, నీ నిర్మలత, నీ కార్యచతురత వీటిలో ఒక్కదానినైనా నాదిగా చేసికొని, జీవితాన్ని సాఫీగా గడపలేక పోతున్నందుకు, పరిపరివిధాలా ప్రాధేయపడుతూ, బాధపడుతున్నానని, వర్షాకాలపు వరుణదేవునితో పందెంవేసి లేఖలువ్రాశావే! తరుచుగా నావద్ద వుంటుండే దానవే అవన్నీ మరచిపోయినావా. ఒకసారి నేను జాబులు వ్రాయుటలో వారంరోజులు ఆలస్యం చేశానని యీ స్నేహబాంధవ్యాన్ని వదులుకొందామని చూస్తున్నావా యీ ఆత్మీయత యీనాటిదికాదు. యీ మనమైత్రి భగవంతుని ప్రసాదితం అని నొక్కినొక్కిచెప్పావే! ఆ నీ నీతి యేమైంది!

ఇక ఆషాబేగం! నీవో! ఖురాన్ సాక్షిగా ఖరార్లు పలికావు. జిందగీ సే బఢకర్ యిన్సానియత్ బడా హై, అని నాతో వేలకొలది మారులు వుచ్చారణ చేయించావు. సైన్సును వ్యతిరేకించి సాంప్రదాయాలకు అనుగుణంగా సహజాతిగా ఒకే రికాబులో విందు గుడిచాం, యేకపాత్రా వారిగ్రాహులమయినాము. నీవే నేను, నేనే నీవుగా, వేష భాషల వ్యత్యాసము, తరతమబేధములు లేకుండా మెలిగాము. ఆటపాటలలో నీమీద నాకు నామీద నీకు చిరు కోపాలు కలిగినప్పుడు, సంధిచేయు రాయబారి లేకనే, గోల్కొండ కిల్లాపై తానీషాగారి తఖ్తుమీద కూర్చొని, జిలేబీలతో సంధికొడంబడేవాళ్ళం. అదైనా నీకు జ్ఞాపకంలేదా! చేతనా ప్రపంచంలో మనం అడుగు పెట్టిన తొలిరోజుల్లోనే, యెక్కడైనాసరే, యెంతటిదైనా సరే, దుర్మార్గాన్ని వ్యతిరేకించడమే మనవిధి యని, అనేక ఆశయాలతో, మన తాహతులకు మించిన శక్తులను సమీకరించుకొని సంచరించుచుండెడివారం. ఈనాటి నీ వుద్యోగపు హోదాలో అట్టడుగున పడిపోయినావా. నేను నీకు ఒక్కసారైనా తలంపుకు వచ్చి చూడాలనిపించదా, కనీసం వుత్తరమైనా వ్రాయాలనిపించదా. అదే నీధర్మమైతే, ఆ దేవుడే న్యాయాన్యాయాలు పరిశీలించాలి. నీవు చెప్పిన, చెప్పించిన సూక్తులకు నాలుగు యుగముల లోనూ ప్రతిష్ఠ హెచ్చుగాక!

ఆఖరిగా జమునా! నీ గుణగణాలనుకూడా ఒక్కసారి పొగడకుండ లేకున్నాను. నీవిప్పుడు పెద్ద మెంబరువు. నీభర్త పోలీసు అధికారి మొట్టమొదట నిన్నొక దుర్మార్గునిబారినుండి రక్షించానన్నమాట మరచావు. తర్వాత నిన్ను ప్రయివేటుగా చదివించి మూడు సంవత్సరములపాటు తదుపరి 1 సంవత్సరం N. C. C. ట్రైనింగ్ యిప్పించి, సమాజంలో నీకూ కొంత ప్రతిపత్తిని కలిగించానన్న విషయం మరచావు. నీవెక్కడకెళ్ళినా పుట్టిల్లుగా నేనున్నచోటికి వచ్చి పోతుండేదానవు. అట్టినేనే, యీనాడు నీ దృష్టిలో కాలసర్పమునయినాను. భయపడి దూరమయినావు. భగవంతుడేదిచేసినా, నా మేలుకే అనుకొంటాను. ఒక్కసారి మనచెలిమిని జ్ఞాపకంచేసికో. అధికారులవల్ల ఒక్కసారి మనయెడబాటుకు, మొత్తం సమాజాన్ని, సమాజాశయములనే చర్చించి విమర్శించావే! ఈనాడు వ్యష్ఠిగా నీలో మానవత్వమే నశించిందా; నశించకపోతే నన్నెందుకు మరచియుంటావు. ఒకసారి అమరావతిలో కృష్ణానది ఒడ్డుననున్న మామిడితోపులో కూర్చొని, పవిత్రనదీజలాల సాక్షిగానూ, దరణికోట మట్టిదిబ్బలమీద కూర్చొని, బుద్ధదేవుని, శిధిల శిల్పాల సాక్షిగానూ, చేసికొన్న ప్రమాణవాహినికి నీ అహంకార మనబడే అడ్డుకట్టను వేశావా! కొండవీటి దుర్గంపైన షోష్ఖానాలో రెడ్డిరాజులు బ్రాహ్మణకుయుక్తులుగా మనమాడుకొన్న నాటిక వుద్దేశ్యమైనా నీ మదిలో పొడచి, యింతకాలంగా నీకు నన్ను జ్ఞాపకం చేయడంలేదా! నాతో స్నేహం నీ హోదాకు భిన్నమని దూరమయినావా! మరొకసారి మన బెంగుళూరి విజిట్‌లో లాల్‌బాగ్‌కు వెళ్ళినపుడు, జంతుశాలలోని తెల్లని నెమలిని, నన్నూ యిద్దరినీ రెండు చూపుడు వ్రేళ్ళతో చూపుతూ ఒకరికొకరు పవిత్రతకు తులనాత్మకములన్నావే, యిప్పుడు ఆ నీమతి మలినమయినదా! మరొకదఫా మనిద్దరం కొండపల్లికిల్లా నెక్కి, దుర్గమంతా చుట్టి తిరుగుచూ, మనమీ కొండలకు కొదమసింగములము లేకుంటే యేకౄరమృగమైనా యీపాటికే మింగేసియుండును. మనమింకా యెన్నో ఘనకార్యాలు చేయాలనుకొంటూ, పురోగతిరోగమనములు సాగించాము. అవన్నీ యీనాటి నీ ఐశ్వర్యములలో కలత నిదురలోని స్వప్నములయినవా! ఆంజనేయస్వామిని దర్శించుటకు కృష్ణాబ్యారేజి సీతానగరం కొండ లెగబ్రాకుతుంటే కమ్యూనిష్టునని నన్నూ, రైల్లో ప్రయాణం చేస్తుంటే పాకిస్తానీవని, నిన్ను అరెస్టు చేసినప్పుడు ఆంధ్రదేశపు నడిగడ్డవాసులమని నిరూపించుకోవడానికి

మెన్నికష్టాలు పడ్డామోవూహించుకో. ఇలాగే యింకా లక్ష సంఘటనలున్నాయి. ఎన్నైనా హృదయద్రవితములే. నేను మాత్రం యిదే స్థలంలో కొన్నిసంవత్సరాలుగా వుంటున్నానని తెలిసికూడా యిటీవల కొంతకాలంగా మీరందరూ కలసి నన్ను దూరంచేశారు. ఇప్పుడైనా యింతకర్కశంగా మీగురించి భావించుచున్నందుకు నన్నూ. కఠినులైనా మిమ్ము, మనందరినీ క్షమించమని భగవంతుని మనసారా ప్రార్థించుచున్నాను" అంటూ కరుణమ్మ మంచంమీదనే బొమ్మసిలిపోయింది.

కరుణమ్మయొక్క మనస్తాపమును కొంతవరకు అర్థంచేసికొన్నవారమై, హెల్తువిజిటరు మా లలితవద్ద నున్న బి కాంప్లెక్సు 2 సి. సి. లివర్ ఎక్స్ట్రాక్ట్ 2 సి. సి యింజక్షన్స్ యిప్పించి, కొంతవరకు సపర్యలు చేసి, ఫరవాలేదనుకున్న తర్వాత మేము ముగ్గురమూ తిరుగుముఖం పట్టాము.

---

గూళపాలెము హంపనన్న చరిత్రము :

# ధన్యజీవి

## పండిత శ్రీ నారునాగనార్య

గీ॥ స్వార్థ రహితుఁడు, త్యాగిహం-పన్న కెఱఁగి
వీరగంధాదులనుబూసి వీరపూజ
జేసి, కర్పూరపుటారతి సిరులుగూర్చి
కొలిచెదరుగాక తెలుఁగు బిడ్డలు. ప్రపత్తి.

ఆవిశాల వినీల మే-ఘాంబరమున
మినుకు మినుకని చుక్కలు-కునుకుచుండె
పకపక మటంచు నవ్వె, శం-పాలతాంగి-
నెమ్మి పురివిప్పి నెమ్మి నాట్యముచేసె.

నల్వలంకుల భయద నినాద మొదవె.
చిటపట మటంచు వడగల్లు పొటమరిల్లె
తటతట మటంచుఁ జినుకులు, పొటుకు జూపె
మంచివానయెయంచు నాసించె జగము

వానగాదది పెద్ద తు-పానుగాని
ఘనభయాంతరముల గ్రమ్మెఁ బుల్లదుమ్ము
పైరుపచ్చలు పడిపోయి పంటచెడియె
గర్షకులయాస లడియాస-గా వెలార్చె

ఇంటఁ బాతర ధాన్యమ్ము లెల్లఁ జెడియె-
నింటి పైకప్పు గాలికి నెగిరిపోయెఁ
దారునూరయ్యె వస్తువుల్ దడిసి తడిసి
గొంతుకూర్చుండి ప్రజలు గ-గ్గోలువడిరి

నాయనెడివాఁడు లేని యన్యాయకాల
మగుట నిరుపేద కాపురా లంత కంత
కటిక నిప్పచ్చరపు మంటఁ గాలిపోయె,
మిగిలినది బూదియేగాదు, నెగులుగూడ.

ఏదియో? యొక పనిఁజేసి యెట్లో? బ్రదుక
వలెఁగదా! యను నడియాసఁ బ్రబలె బ్రజలు,
దెలపి యిసుమంతలేక రాత్రిందివమ్ము
కన్నకడగండ్లఁ బడిరి యక్కరకొలంది.

భారతంబను మరకత హారమధ్య
నతిశయంబగు వజ్రాల పతక మాంధ్రి
యందు "రాయలసీమ" పొల్పొందు నాణి
ముత్తెమై సకలకళలు రూపెత్తినట్లు.

అందనంతపురీ మండలాంతరమునఁ
జేతికట్టకు వంకరరీతి నెసఁగి
కల డయో మార్గమున కించుకంత దరిసి
కూటి పేదల కొరగల్లు "గుంతకల్లు".

గ్రాసనాసమ్ములకు గొఱగాని చోటు,
హాయిడాయని తావు, కయ్యాలతావు,
నినుప గజ్జెల పెద్దమ్మకును బిడారు
కళలు వెలఁబోని సంత బీదల నెలంత.

ఒడలు వంచి శ్రమించి తేయింబవళ్ళు
పాటుపడుదురుగాని ముప్పూటకొక్క
పూట కూటికిఁగూడ నే-నాటనైన
నోచుకోలేని బడుగులుందురు తిరమ్ము.

ఆపురము కాపురంబుండు నన్నివేళ
లందు మతిజీవులకు సాయమై యలంతి
పేరు, పెంపు, మదింపు రూపింపునట్టె
చకితసుఖజీవనమ్ము శ్రామికజనమ్ము.

వాఁడివేఁడి జగా వెల్గు వాఁడు క్రుంకు
మల దెసన్ వ్రాలెఁ గష్టజీవుల-శ్రమమ్ము
గాంచి సైరింపలేక పగ్గముల వదలి
నేఁడు గుఱ్ఱాల సారథి హెచ్చరించి.

గోవు "లంబా" యటంచు ముం-గోలు నగుచు,
దోఁక లెగఁబెట్టి పర్వులెత్తుచును మందఁ
బాసి చనుచున్నవవె! నిండు-పాలుఁ జేసీ
బరువు పొదుపులతో దమ పదువు కొఱకు

కలరవమ్ముల నండజ-మ్ములు కులాయ
ములను విడివడి యలఁతి గుంపులుగ గూడి
గూటి పిల్లల కెఱ యెత్తుకొని బిరాన
బరువు లిడుచున్న వవిగో? యంబరమునొరసి.

చిక్కమును జంక నిడుకొని జీవధనము
నింటికిం దోలుకొని యుక్కు-వంటి రైతు
"భోగి నెగడి"కిఁ గట్టెల మోపుతోడ
నరుగుచున్నాఁడు విడివడ్డ యలుగుజాడ.

అట్టియెడ "గుంతకల్లు"న కలఁతి తూర్పు
వలఁకునన్ నడబావి దవ్వుల వెలుంగు
మేలునిడు బాలు కయ్య ముత్యాల జొన్న
పండి కోఁతకు వచ్చిన-పరువునందు.

ముత్తెములరాశిఁ బోసిన పోల్కి ఱెల్లు
పూచినటు, ఱిక్కలఁ జిదిమి-పోయుచాయ,
నేల వడగల్లు పఱచిన-లీల జొన్న
విరిసి ఫలియించెఁ గన్నుల కఱవుఁదీర.

గరుడపచ్చలు చాల్వోయుల-కరణి పచ్చి
గడ్డి నునుపారు గనిమపై నడ్డదిడ్డ
ముగఁ బచారించె నొడిసెల- నెగయఁద్రిప్పి
యంచనడఁబోలె నొకకాఁపు మించుబోణి.

కులుకుగుబ్బలు గదల ముంగురులు సెదర
నడుము వడకాడ మొగము చి-త్తడిఁ జెమర్ప
జిఱునగవెసంగ దొలకరించిన మెఱుంగు
వోలె నడయాడె ముగుద చూపుల పడంతి!

పిట్టలను దోలుచుం జెత్త గట్టుకొనుచు,
గొబ్బిపాటలు పాడుచు గునుకునడక
గాఁపుచెలి జొన్నచేనికిఁ గాఁపరియయి,
చెలఁగె నానాటి క్షేత్రలక్ష్మియొ యనంగ.

పొగరుగుబ్బలు పాలచేఁపునకుఁ గ్రేళ్లు
దాటి తన చంటి బిడ్డపై తలఁపునింపి,
చేనిచుట్టును తిరిగి వచ్చెను గృహమ్ముఁ
జేరు తహతహ మది పొంగు-వారు నెలఁత.

పాలకంకులచాలు డాపలను వ్రేల
కసవుగంప బుజాన జోక మెయిఁ గ్రాల
స్తనఫలభరమ్మునన్ గొను, గునిసియాడ,
నినుపదారి బడిన్ నడచెను వలంతి.

ఇంతలో నెటనుండియో యింగిలీసు
జాతిఁ బుట్టిన నొకధూర్త సైనికుండు
వచ్చె నడగొండవలెఁ బిడ్గు వడిన వడువు,
తెంపుమదిఁగూడి తటపటాయింపుతోడ.

అరవిరి గులాబి మైసొరుఁ బొరయుదాని
నాఁడురాయంచవలె నడయాడుదాని
వలపు నిలువెల్లఁ బూచిన వయసుదాని
పైడిగుబ్బల దాచిన పైటదాని.

చేరెఁడంతేసి కందోయి తీరుదానిఁ
దొవలరాయని మొగము సైదోడుదానిఁ
మెఱుపు మెఱసినకరణి డ-గ్గరిలదరసి
వలపుకై పుననిలువెల్ల జలదరింప.

బలిసి కామము గకకుట్టి బమ్మరింప
వలపు కొనవెఱ్ఱిమందు సాపడిన వడువు
దిక్కుఁదోఁపక తాఁబోవు తెరువరయక
చిత్తవిభ్రాంతిఁ గఱచి జగత్తు మరచి.

రెండుచేతులు సాఁపఁ బే-రెమ్మువాఱు
మగువఁ దిగువఁ బ్రయత్నించు తగులుఁబూన
లేనిజవసత్త్వమెటనుండి లేచివచ్చె
నో? యెఱుఁగరాదు. చెలిమిన్న కూయివెట్టి

కన్ను మిన్నాక యె, పర్వి కాచు దైవ
మెవఁడొకో? యని దెసల వీక్షించునంత
నింతలో వచ్చె రక్షకుఁ డెచటనుండి
యూడిపడెనో యటంచు నయ్యువిద యెదుర.

ద్రౌపదీ మానరక్షా ప్రదాత వోలె
గంపమానశరీర దగ్గఱకు జేరి
భయము వలదని చెప్పి నిబ్బరము గుప్పి
తెల్లదొర బంటుఁ జేరి అం-పిల్లదూరి.

కాఁపుచెలి నిన్నదారి చెంగట చెలంగు
నింటిలో డాచి చిలుకుబిగించి ముందు
పోటుమగఁడట్లు నిలబడి పోరఁదొడఁగ
సైనికాధము నొడలెల్ల జల్లనంగ.

# బాలవినోదం

బాలబూ, మీకొక చిన్నకథ చెబుతా. ఇది నిజంగా జరిగిందే. శ్రద్ధగా వింటారుకదూ.

కొన్ని నూర్లయేండ్లకు ముందు మన తెలుగు సీమను శ్రీ కృష్ణదేవరాయలనే చక్రవర్తి యేలేడు. రాజ్యంలో ఏమైనా తగువులొస్తే, ఆయనే స్వయంగా విచారించి తీర్పుచెప్పేవాడు. ఒకనాడు ఒక గడుసైన తగువు ఆయన దగ్గరికి విచారణకు వచ్చింది. యువకుడయినవాది, తన తండ్రికి నేస్తకాడయిన ప్రతివాది తన్ను మోసగించాడని మొరపెట్టుకున్నాడు. అతడు తన దావాపత్రంలో "మహారాజా, మా తండ్రికి ఈ ప్రతివాది నమ్మకస్తుడయిన మిత్రుడు. అందుచేత— ఆయన తాను కూడబెట్టిన పదివేల మోహరీలను ఇతడి దగ్గర దాచబెట్టి, నాకు యుక్తవయస్సు రాగానే- ఆసొమ్ములో ఇతడి ఇష్టంవచ్చినంత నా కిమ్మని మరణ శాసనం వ్రాసియిచ్చి చనిపోయాడు. ఇప్పుడు ఈ ప్రతివాది, ఆ సొమ్మంతా కాజెయ్యాల్నే ఉద్దేశంతో నన్ను మోసగింప చూస్తున్నాడు" అని మనవి చేసుకున్నాడు.

శ్రీకృష్ణ : ఓయీ, ప్రతివాదీ! నీవు వాది చెప్పినవన్నీ విన్నావుకదా! నీ వీ విషయంలో ఏమి చెబుతావు?

ప్ర. వా: ప్రభూ, ఇదిగో, నా చెలికాడి మరణశాసనం, చిత్తగించండి. ఇందులో— నా కిష్టమైనంత పైకం వాదికి ఇవ్వవచ్చునని ప్రత్యేకంగా సూచింపబడివుంది.

శ్రీకృ : వాదీ, ఇందులోని విషయాలు నిజమే కదా ?

వాది : దేవరా ! మరణశాసనంలోని— "నీయిష్టము వచ్చినంత"— అనే వాక్యధోరణినిబట్టి, నిజమనే భావించాలి. కానీ, ఈ ప్రతివాది ఒక్క వేయి మొహరీలే నాకు ఇయ్యాల్నని మిగతా తొమ్మిదివేలూ తానే కొట్టేయాల్నని చూస్తున్నాడు. ఇది ధర్మమేనాండి!

శ్రీరాయలుకూడా, తండ్రి కష్టపడి స్వయంగా ఆర్జించిన ధనం కుమారుడైన ఆ యువకుని అనుభవానికి దూరంచేయటం చాలా అక్రమం, అన్యాయం అని అభిప్రాయపడ్డాడు. కాని మరణశాసనాన్ని కాదని ఆయన ఎలా త్రోసివేయగలడు? ఆయన సందిగ్ధస్థితిలో ఏమిచేయటానికి పాలుపోక, ఎలా తీర్పుచెప్పటానికి, వీలుగాక ఇరకటంలో పడ్డాడు. దీర్ఘ విచారంలో మునిగి పోయాడు.

మహారాజు నిస్సహాయావస్థ జాగ్రత్తగా పరిశీలిస్తున్న తెనాలిరామకవి తటాలున లేచి — "ప్రభూ, అన్యథా భావించక అనుగ్రహించి యీ వ్యవహారంలో తోడ్పడేందుకు నాకు ఉత్తర్వు ఇవ్వాల్నని ప్రార్థిస్తున్నాను."

శ్రీకృ : నీవు మాత్రం ఈ తగాదాలో ఏమిచెయ్యగలవు కవీ ! మరణశాసన నిర్ణయం విస్పష్టంగా మనకు కనబడుతూనే వుంది. ఇదిగో, కాస్త సవిమర్శగా చూడు.

తెనాలిరామకవి మూడునాలుగు పర్యాయాలు త్రిప్పి త్రిప్పి చదువుకొని రాయలవారికి తిన్నగా ఆ పత్రాన్ని సమర్పించి ప్రతివాది తట్టు తిరిగి "ఓయీ ఈ యువకుడికి నీవు ఏ మాత్రము ముట్ట చెప్పాలనుకున్నావు?"

ప్ర. వా : వేయిమొహరీలు మాత్రం.

తె. రా : మిగిలిన తొమ్మిదివేలు?

ప్ర. వా : నేను నాకోసం తీసుకుంటాను.

తె. రా : ఏల?

ప్ర. వా: తీసుకోవాల్నని యిష్టపడ్డాను. తీసుకుంటాను. అంతే!

తె. రా : అంటే, తొమ్మిదివేలు నీ విష్టపడ్డావన్న మాట.

ప్ర. వా : అవునండి!

తె. రా : అప్పుడా ఒక్కవేయి నీ విష్టపడలేదని భావం.

ప్ర. వా : లేదండి.

తె. రా : నిశ్చయమేకదా !

ప్ర. వా : నేను ప్రకృతం జీవంతో ఉండటం ఎంత నిశ్చయమో, అదీ అంత నిశ్చయమండి.

తెనాలిరామకవి రాయలవంకకు తిరిగి "మహారాజా! తాను ఇష్టపడింది తొమ్మిదివేల మొహరీలని, తక్కిన ఒక్కవేయి ఇష్టపడలేదని యీ మహాసభలో ప్రతివాది గంభీరంగా వాఙ్మూలం ఇవ్వటం తాము కూడా చిత్తగించారుకదా ! ప్రకృతం మనం వాది తండ్రి మరణశాసనం బాగా పరిశీలించి చూస్తే, దానిలోని వాక్యాన్నిబట్టి, "తాను ఇష్టపడినంత సొమ్ము"ను వాదికివ్వాల్నని స్పష్టపడుతున్నది. కనుక ప్రతివాది ఇష్టపడిన తొమ్మిదివేలు మొహరీలు తక్షణం వాదిపరం అయేటట్టు తప్పకతీర్పుచెప్పాలి. ఆవల తమ చిత్తం."

శ్రీకృష్ణదేవరాయలు మందహాసం చేస్తూ "ఎంత గడుసరివోయ్, కవీ, నీవు?" అని అతడి వెన్నుదట్టి మెచ్చుకొని, తదనుసారమే తీర్మానించాడు.

చూచారా, బాలలూ, తెనాలిరామకవి తెలివితేటలు, మీరుకూడా అలా బుద్ధిమంతులు అవాలి!

# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తికలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంచే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు.



# బొమ్మలు: తోలుబొమ్మలు

బొమ్మలు, తోలుబొమ్మలు, భారతజాతియొక్క పరంపరాగతంఅయిన కళలు; ఒకవృత్తికి ఉపపత్తులు గూడ. ఇన్నాళ్లవరకది విస్మృతిపథంలో ఉండినా, ఇప్పుడది బయటపడింది. వాటిని మనం ఇంతవరకు మనస్సులో భావించనైనాలేదు. అదృష్టవశాత్తుకొందరు కళావేత్తలు వాటివిలువను, రసావిష్కరణాన్ని, తత్త్వా తత్త్వాన్ని కనిపెట్టి చెప్పారంటే, ఆకళల్లో మనం ఎంత ఉదాసీనులుగా ఉంటిమో సులభంగా గ్రహించగలం. ఒకరు చెప్పేంతవరకు, మన దేశీయకళలమీద మనకు విశ్వాసం లేకపోయింది. తోలుబొమ్మలాటలను పూర్వకాలంలో కొందరు వృత్తిగా పరిగ్రహించి- సంచారచ్ఛాయాచర్మపాంచాలికలను (Touring Cinemas) ప్రదర్శించేవారు.

ఇప్పటికీకూడా ఈ బొమ్మలాటనే వృత్తిగాగల కొన్నిగ్రామాలలోని కుటుంబాల్లో అందంగా పలు వన్నెలతో ఒప్పుతూవుండే తోలుబొమ్మల్ని చూడవచ్చు. అనంతపురమండలంలోని బొమ్మలాటపల్లి- అనే గ్రామం ఇట్టిబొమ్మల్ని తయారుచేసే ఆంధ్ర ప్రదేశ్ గ్రామాల్లో ఒకటి. రామాయణ మహాభారత కథలను ప్రదర్శించే ఈ బొమ్మలనిర్మాణం తమకు పారంపర్యంగా వచ్చేహక్కని గర్వపడే గ్రామస్థులు ఆంధ్రదేశంలోని పెక్కుప్రాంతాలలో ఉన్నారు. కాని వారిసంఖ్య చాలాతక్కువ. 'కలంకారి' రంగులతో గుడ్డలమీద చిత్రింపబడ్డ చిత్రాలు తోలుబొమ్మలాటలో సాధారణంగా ప్రదర్శిస్తారు. అంతేకాకుండా, మెత్తనికర్రతోను, రంపపుపొట్టుతో, చింతగింజల గుజ్జుతోను- చేయబడే కొండపల్లిబొమ్మలు కూడా ఈయాటకు ఉపయోగిస్తారు. తోళ్లతోను, గుడ్డతోను దిద్దితీర్చబడ్డ బొమ్మలకు మధ్యమధ్య రంధ్రాలు ఉంటాయి. ఆబొమ్మ లాడించినపుడు, వాటి వెనుకతట్టున్న దీపాల కాంతులవల్ల అవి అలంకారాలు గలిగినట్లుగా అగపడతాయి. ఆటకాడు వాటిని ఆడించేటపుడు కథను వ్యాఖ్యానిస్తాడు. దానికి అనుగుణంగా, ఆ తెఱమీది తోలుబొమ్మఛాయ చేతులు, కాళ్లు, కండ్లు, నోరు కదుల్తుంది. అది నిశ్చయంగా ఒక నాటకంమోస్తరుగానే ప్రేక్షకులు ఆశ్చర్యంతో చూస్తుంటారు.

తెలుగుదేశంలో చాలాకాలంగా ఈ బొమ్మలు తయారుచేయటం, వాటిఛాయాచిత్రాల్ని ఆడించటం రెండూ పారంపర్యంగా వస్తూండే జానపదకళలు.

మానవజాతి ఎంతప్రాచీనమయిందో- ఈబొమ్మలు కూడా అంత ప్రాచీనమయింది. వీటి ఆకారస్వాస్థ్యాలు, నిర్మాణపద్ధతులు- ఆకాలంలోని పరిసరాల స్వభావాన్నిబట్టి, సాంఘికమర్యాదనుబట్టి, ఆర్థిక దోహదాన్నిబట్టి వుండేవి. ఆయా ప్రదేశాల్లో వాటిని చేయటానికి కావలసినసరకు దొరకాలి. దాని పెట్టుబడికి తగినంత ఆర్థికసహాయం లభించాలి. ఈ రెండూ తటస్థపడినప్పుడు ఆవృత్తిలో ఉండేవాళ్లు తప్పక తమ కళను దేశవ్యాప్తం చేయగలరు. కడచిన అర్ధశతాబ్ది కాలంగా, పిల్లలు కొంతవరకు తమ పెద్దల తీవ్ర నిర్బంధాలనుండి విడివడి, స్వేచ్ఛగా పసితనంలో- తమ బుద్ధిని ఇచ్చవచ్చిన కార్యాలకు మళ్లిస్తున్నారు. ముఖ్యంగా వాళ్ల మెదళ్లు క్రొత్తక్రొత్త బొమ్మలను చూచినప్పుడు ఉల్లాసపడుతాయి. కనుక 50 ఏండ్లుగా బొమ్మలకు బంగారుయుగమని చెప్పవచ్చును. కాని, యిది పూర్తిగా ఇండ్లలోనూ, బళ్లలోనూ తగిన ప్రచారం- ప్రోత్సాహంలేకుండ ఉండటం శోచనీయం. ప్రకృతం,- కొయ్య, గుడ్డ, లోహం, కాగితం, కొన్ని గుజరులు, రబ్బరు, సెలూలాయిడ్- మున్నగువాటితో తయారుఅయిన బొమ్మల్ని మనం చూస్తున్నాం. అలాటివి పసిపిల్లలకి సంతోషాన్ని తాత్కాలికంగా కలిగిస్తాయి. కాని, తోలుబొమ్మలఆటలు మొదలయిన వాటిలో ఉపయోగపరచినప్పుడు- కలిగేభావాలు, శారీరకంగా- మానసికంగా వాళ్లల్లో హత్తుకుపోతాయి. పైగా, ఆ బొమ్మలు వారివారి వయోవస్థల్ని అనుసరించి అనేకరకాలుగా ఉంటాయి. అవన్నీ మన భారతదేశంలోని వివిధరూపాలకు, ఆచారవ్యవహారాలకు, అలవాట్లకు సంబంధించినవి కావటం చేత, ఆ పిల్లలకి సులభంగా అర్థం అవుతాయి. వాటిని చేసే పనివాళ్లు అంతటి మెలకువతో వాటిని నిర్మిస్తారు. దేవతలు, దేవతాస్త్రీలు, అనేకవృత్తులు గల మానవులు, పశులు, మృగాలు, పూవులు, పండ్లు తద్వత్తుగా, అవే అనే భ్రమను ప్రేక్షకులకు కలిగించే మోస్తరు తయారుచేసేవాళ్లు. వాటి ఆకారాలు, వన్నెలు పిల్లలమనస్సులకు ఉత్సాహాన్ని రేకెత్తిస్తాయి. వస్తుప్రతిబింబాలయిన ఆ బొమ్మలను తాము నిజంగానే చూస్తున్నట్లు వాళ్లు భావిస్తారు. ఆంధ్రప్రదేశ్‌లో పెక్కుతావులలో ఈచేతివృత్తి వ్యాపించివున్నా- ముఖ్యంగా పేర్కొనతగ్గస్థలాలు :-కొండపల్లి, నిర్మల, ఏటికొప్పాక, తిరుపతి- అనే నాలుగుమాత్రమే.

ఈ కుటీరపరిశ్రమ తరతరాలుగా, ఆదిలాబాదు మండలంలోని నిర్మల అనే గ్రామంలో విశేషం. అక్కడ మిక్కిలితేలిక అయిన బూరుగు, పూంకి అనే కట్టలతో ఈబొమ్మలు చేసి చింతగింజల గుజురు (బంక వంటి పదార్థం) తో అతుకుతారు. చింతగింజలను నానబెట్టి, వాటిపై తోలుతో సహా రుబ్బి కావలసినంత నీళ్లుపోసి ఉడకబెట్టి, బంకవిధంగా తయారుచేస్తారు. నిర్మలలో- ఇట్టి పదార్థాలు సేకరించటం సులభం. వాళ్లు బొమ్మలే కాకుండా, వీటితో పళ్లేలు, చిన్నచిన్న పెట్టెలు, అలమారలు, సన్నని (చీట్లాడే) చీట్లు, చట్రాలలో బిగించే తెరలుకూడా తయారుచేస్తారు. నిర్మలలో ఈ పరిశ్రమను అభివృద్ధికి తేవటానికి ఇప్పుడు ఇంకా సౌకర్యాలు కలిగించబడింది. ఈ వృత్తిని అవలంబించేవారికి తగినతరిబీతును ఇయ్యడానికికూడా సదుపాయాలు కలిగింపబడింది. దీనికి తోడుగా ఒక సహకారసంఘం యేర్పడి అన్నివిధాలా ఈచేతివృత్తికి దోహదం ఇవ్వటానికి- ఈవూరు ఒక కేంద్రంగా నియమించబడింది. అలంకారంతోకూడి అందంగాఉండే యీ నిర్మల బొమ్మల పనితనం చూచి 'నిర్మలపాంచాలికలు'- అనే పేరితో హైదరాబాదు రాష్ట్రవాసులంతా అక్కడక్కడా దాన్ని అనుకరించి బొమ్మల తయారీ చేస్తూ బజారుల్లో అమ్మకానికి విక్రయిస్తూవుంటారు. తబుకులు, తెరలు, గాజుదీపాల సెమ్మెలు, పొగచుట్టల డబ్బీలు, స్త్రీల పాదరక్షల ముడిమెలు, నగలపెట్టెలు,- ఈలాటివి వారు సాధారణంగా చేస్తారు. మిక్కిలి శ్రేష్ఠమైనవి- మనస్సును ఆకర్షించేవి- అయిన చిత్తరువులను ప్రదర్శించే నిర్మల బొమ్మలకు- ఎంతకాలానికైనా చెదరిపోని రంగులు ఇచ్చేవారు. ఆ రంగులు వ్రేళ్లు వెల్లంకుల రసాలతో సమకూర్చుకొనేవారు. ఇలాటి కళాపూరితాలయిన బొమ్మలను పోలిన కుటీరపరిశ్రమలు చాలా అరుదు అనటంలో సందేహంలేదు.

కృష్ణామండలంలోని తెల్లపొణుకు కొయ్యతో— ఏలాటిబొమ్మనైనా- ఆ ప్రాంతాలవాళ్లు చెక్కుతారు. వాళ్లు సాధారణంగా పశులు, పిల్లల ఆటవస్తువులు, పౌరాణిక వ్యక్తులు మొదలయినవాటిని తమకు అందుబాటులో వుండే— తగుప్రాంతాల్లో విరివిగా దొరికే పొణుకుకఱ్ఱతో నిర్మిస్తారు. 'ఆర్యక్షత్రియు'— లనే ప్రత్యేకజాతికి ఈ చేతిపనే జీవనాధారం. వాళ్లు రాజస్థాన్ నుండి వచ్చినవారని చరిత్రలవల్ల తెలుస్తున్నది. కొండపల్లిలో దాదాపు 15 కుటుంబాల క్షత్రియులు ఇప్పటికీ ఈ వృత్తిని అంటిపట్టుకొని మనుగడ జరుపుకొంటున్నారు. వీళ్ళకోసం ఒక సహకారసంఘం కూడా స్థాపింపబడటంమాత్రమే కాక, యీ కళాభివృద్ధికయి తగినసౌకర్యాలు సూచిస్తూ ఒకప్రణాళిక కూడా తయారుచేయబడింది. దాన్ని అనుసరించి కొందరికి తర్బీతుసహా ఇవ్వబడుతూవున్నది. కొండపల్లి ఒకచారిత్రాత్మకం అయిన ప్రదేశం. కనుక చాల మంది యాత్రికులు వస్తారు. వాళ్లు తప్పక యీ బొమ్మలపై మోజుపడి కొనుక్కోవడంవల్ల ఈ బొమ్మలకు గిరాకీ యెక్కువ. విజయవాడలోని ప్రభుత్వ కుటీర పరిశ్రమా వస్తువుల విక్రయంకోసం ఒక ప్రదర్శనశాల స్థాపింపబడివున్నది. దానిగుండా తయారయిన బొమ్మలు ఎప్పటికప్పుడు విక్రయం అవుతున్నాయి.

తిరుపతి కొయ్యబొమ్మలు శతాబ్దాల తరబడి ప్రఖ్యాతిపొందినాయి. ఈప్రదేశంలో కొయ్యతో దేవతలు, దేవతాస్త్రీలు, మానవులు, మృగాలు మొదలయిన బొమ్మలు చేస్తారు. పరంపరాగతం అయిన సౌందర్యంతో ప్రకాశించే యీ బొమ్మలకు బజారులో మంచివిలువ అనే చెప్పాలి. మరీ ఉత్సవదినాల్లో ఆ బొమ్మలకు వెల అధికం. ఇక్కడ చేతిపనులశాఖ బొమ్మలు చెక్కే విషయంలో బాలురకు మంచి తరిబీతును ఇస్తూ, వారిచే నిర్మించబడ్డవాటిని బజార్లలో మంచివెలలకు అమ్ముతున్నది. ఆబొమ్మల నిర్మాణంలో క్రొత్తమార్పు లేవీ లేవు. క్రమానుసరణమయిన పద్ధతులలోనే వాటిని ఈనాటికిగూడా చేస్తారు. ఈ తిరుపతి బొమ్మలు- కానడా, అమెరికా (సంయుక్త రాష్ట్రాలు) తక్కిన విదేశాలు బాహాటంగా కొంటున్నాయి. వీటి అభివృద్ధికోసం ఇక్కడకూడా ఒక సహకారసంఘం పనిచేస్తున్నది.

విశాఖపట్టణం జిల్లా— సర్వసిద్ధి తాలూకాలోని యేటికొప్పాక గ్రామంలో, ఈ బొమ్మలకు మెరుగుఇచ్చే వార్నీషువంటి పదార్థం తయారవుతుంది. ఒకప్పుడు ఈ వార్నీషు ఉచ్చదశలో ఉండి ప్రఖ్యాతి పొందింది; కాని పరదేశపు వార్నీషుల ప్రాబల్యంవల్ల ఇది నానాటికి క్షీణదశకు వచ్చింది. ఇక్కడి మెత్తనిది— తేలికయినది- చిరకాలం ఉండేది అయిన కొయ్యతో బొమ్మలు తయారవుతాయి. మైసూరు రాజ్యంలోని చెన్నపట్న— అనే యూరిపరి

సరాల్లో చేయబడే బొమ్మలలాంటివే ఏటికొప్పాక లోను చేస్తారు. ఈ రెండుచోట్లలోను తబుకులు, ఎడ్లు, రైల్వేఇంజనుల– గ్రామొఫోనుల మాదిరులు ఇంకా చిత్రవిచిత్రములైన పిల్లలాడే ఆటవస్తువులను చేస్తారు. ఇక్కడి బొమ్మలకుకూడా మంచి గిరాకీ గలదు. ఈవిధంగా బొమ్మలు— తోలుబొమ్మలు తాము పోగొట్టుకొన్న మునుపటిస్థానాన్ని మరలా ఆక్రమించు కొంటున్నవి. ఈ విషయంలో శ్రద్ధవహించి తగిన ఆర్థికసహాయం చేసే రాష్ట్రప్రభుత్వానికి ధన్యవాదాలు. పైగా, అఖిలభారత కుటీర పరిశ్రమాభివృద్ధి సంఘం సానుభూతితో తగిన సలహాలు ఇస్తున్నందుకు ఆంధ్ర రాష్ట్రం కృతజ్ఞత చూపాలి. ఇప్పటికి పైజెప్పిన ప్రదేశాల్లో దాదాపు రెండులక్షలు విలువగల బొమ్మలను తయారుచేశాయి. అందు కొన్ని పరదేశాలకు ఎగుమతి చేయటానికి సర్వసిద్ధంగా ఉన్నాయి.

(డాక్టరు R. V. రావుగారి ఆంగ్లానువాదము)
'హిందూ' 5-2-1961



# D-విటమిన్లు - వాటి ప్రయోజనాలు

మనం ఎక్కువకాలం సూర్యకిరణాలు ప్రసరించే చోట్లలో ఆరుబయట ఉండాలి. మన పద్ధతులకి అనుకూలం, ఆరోగ్యం కలిగించే సూర్యకిరణాలవల్ల D-విటమిన్లు ఉత్పత్తి అవుతాయి.

ఈవిటమిన్లున్ను, లోహసంబంధం అయిన ధాతువులున్ను మనకు అత్యావశ్యకం అని, చలికాలంలో కంటే ఎండకాలంలో అత్యధికంగా పెరిగే మనచేతి వ్రేళ్ల గోళ్ల మూలంగా ప్రకృతిసిద్ధంగా ఋజువు అవుతున్నవి.

ఆహారవస్తు స్వభావాలు, సాధారణంగా చక్కని ఆలోచనలు సరిఅయిన నరముల కదలికలమీద ఆధారపడిఉంటుంది. కనుకనే ప్రత్యేకంగా లోహపదార్థాలు విశేషంగా కల ఆహారాలు భాస్వరంతో (With phosphorus) కూడి పెళుసుగా చీలే వ్రేళ్లగోళ్లు మొదలయినవాటికి బలాన్ని చేకూరుస్తుంది.

మొదటి రాసాయనిక వస్తుపరిశోధనల్లో ఇటీవల పరిశోధకులు "అది ఎక్కువగా భాస్వర ఆమ్లమును ఉత్పత్తిచేస్తుం"దని కనుగొన్నారు. ప్రతిఆలోచన, ఊహ, అలా ఉత్పత్తి అయ్యే భాస్వరాన్ని దహిస్తుందని చెబుతున్నారు.

భాస్వర సంబంధమయిన పదార్థం విశేషంగా గల ఆహారపదార్థాలు :-

(1) బత్తాయిపండ్లు
(2) గుమ్మడికాయలు
(3) ముల్లంగి
(4) తెల్లని గోధుమలు
(5) పచ్చిగ్రుడ్డులోని పచ్చనిజెన
(6) బార్లీ
(7) బాదం
(8) కాలీ ఫ్లవరు
(9) బియ్యము
(10) తక్కాలి
(11) సముద్రపు చేప
(12) పులుసునిమ్మ
(13) అక్రోటు
(14) ద్రాక్షపండ్లు
(15) దోసకాయ
(16) వెన్న
(17) చిక్కుడు

మెదడు ఎక్కువశక్తితో వేగంగాను, బలంగాను పనిచేయవలెనంటే, బొగ్గు సంబంధమయిన పదార్థాలతో చేరిన ఆహారవస్తువులను- అనగా, ముఖ్యంగా జావ (గంజి) వస్తువులను, చక్కెరతో కూడిన వస్తువులను సాధ్యమయినంతవరకూ తగ్గించాలి. సాధారణంగా బంగాళాదుంపలు, పచ్చిబటానీల వంటి కాయధాన్యాలు, పిండ్లతో తయారయ్యే దోసెలు, అరిసెలు, రొట్టెలు, బన్నులు, కేకులు- మొదలైనవి ఎక్కువగా తినేవారికి మెదళ్లు చురుగ్గా పనిచేయవు. జడత్వం వహిస్తాయి. బొగ్గు పదార్థాలుగల వస్తువులు జీర్ణకోశంచుట్టూ చేరి, రక్తం ఉత్పత్తికి దాని వ్యాప్తికి అడ్డుపడతాయి. అది ఎక్కువగా పనిచేయవలసిన మేధస్సులోని నరాలగుండా రక్తం ప్రవహించనీదు.

ఆరుబయట సూర్యకిరణాల వేడిమి శరీరాన్ని స్పృశించే స్థలంలో కొంతసేపు ఉండటం ఆరోగ్య సూత్రాలలో మిక్కిలి ముఖ్యమయింది. నీవెన్నడయినా వెచ్చని యెండలో కూర్చుండి దేహానికి చైతన్యం కలిగించాల్నని ప్రయత్నించావా? అది మొద్దుబారిన మన నరాలకు కదలిక కలిగిస్తుందనే విషయం గుర్తించావా? లేనియెడల ప్రయత్నించు. సూర్యరశ్ములు జీవప్రసాద శక్తి సముపేతాలు.

# కీ॥ శే॥ పండిత గోవింద వల్లభపంతు

కేంద్ర దేశీయాంగశాఖామాత్యుడు శ్రీ పండిత గోవిందవల్లభపంతుగారు 8-3-1961 తారీఖు ఉదయం నిర్యాణంకావడం- దేశానికి కాంగ్రెస్సుకూ, ప్రభుత్వానికికూడా పెద్ద ఆఘాతమనే చెప్పాలి. దాదాపు పదేండ్లక్రిందట కీ॥ శే॥ పటేలుగారి మరణంతోనే నడుములువిరిగిన ప్రధాని నెహ్రూగారు ఆ పదవికి అర్హుణ్ణిగా భావించి శ్రీ పంతుగారిని నియమించుకొన్నారు. తుదకు ఆయనకూడా దేహం చాలించటంతో నెహ్రూగారికి కుడిభుజం విరిగినట్లయింది. కాంగ్రెసుసంస్థయొక్క మూలస్తంభం కూలినట్లయింది. ఇది ఇంతటా, అంతటా పూడే లోటుకాదు.

శ్రీ పంతు స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొన్నవారిలో అగ్రగణ్యుడు. పలుమారు కారాగారాల్లో నిర్బంధింపబడ్డ దేశభక్తుడు, దొడ్డరాజ్యాంగవేత్త. పరిపాలనాదక్షుడు. జాతీయసౌధనిర్మాత. ప్రశాంతహృదయుడు. తనదగ్గరకు వచ్చువారి మొఱలను సావధానంగావిని, తగినసలహాలిచ్చి పంపడంలో చాకచక్యం గలవాడు. ఎట్టి గడ్డుసమస్యలనైనా యిట్టే తీర్చడంలో ప్రధానికి తరువాత పేర్కొనదగిన నిపుణుడు.

పాఠకులకి ఆదర్శప్రాయమైన ఆయన జీవితాన్ని సంగ్రహంగా తెలపడం యుక్తమని ఈక్రింద ప్రకటిస్తున్నాము.

పండిత పంతు ఉత్తరప్రదేశ్‌లోని అల్మోరా జిల్లాలో పహారిబ్రాహ్మణవంశమందు 1887 సం॥ సెప్టెంబరు పదవ తారీఖున జన్మించాడు. ఆయన 1905 సం॥రం అలహాబాదులోని మాయిరు కాలేజిలో ప్రవేశించి తన తెలివితేటలచేత విద్యార్థులకందఱికి నాయకుడుగా ప్రకాశిస్తూ ఉండేవాడు. 1918 లో ఆయన అలహాబాదు హైకోర్టు న్యాయవాది అయి నైనిటాలులో పనిచేస్తూ, ఆ వృత్తిలో మిక్కిలి ప్రఖ్యాతిని గడించినాడు. విశేషంగా ఆయనకు ధనాదాయంకూడా వుండేది. కానీ, త్వరలోనే ఆయన దృష్టి స్థానిక రాజకీయాలవంకకు మళ్ళడంచేత, తన న్యాయవాదవృత్తిని విసర్జించాడు.

1916 వ సం॥రం అఖిలభారత కాంగ్రెసుసభాసంఘసభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. 1923 న ఐక్యరాగాణరాష్ట్ర శాసనసభ్యత్వం పొందాడు. 1937 న ఆ ఉత్తరప్రదేశ శాసనసభలోని కాంగ్రెసుపక్షానికి నాయకుడై మొదటి కాంగ్రెసు మంత్రివర్గాన్ని యేర్పరచాడు. 1927 లో స్వరాజ్యపార్టీ శాసనసభలో ప్రవేశించినప్పుడు తాను కాంగ్రెసు ప్రతిపక్షవర్గనాయకుడై ఏడేండ్లవరకు వారితో పోరాడినాడు. 1918 లో సైమన్ కమీషన్ బహిష్కరణలో ముఖ్యపాత్ర వహించి నల్లజండాల ఊరేగింపును నడిపి పోలీసుల తీవ్రమైన లాఠీదెబ్బలకు గురియై, చాల కాలంవరకు నడుము పైకెత్తి నడువలేక పోయాడు.

ఆయన 1931 నుండి కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గంలో శాశ్వతంగా మరణించేవరకు సభ్యుడుగా ఉంటూవచ్చాడు. కానీ 1930-1932 లలో శాసనోల్లంఘనం చేసి కారాగారానికి వెళ్లాడు. ఆల్ ఇండియా పార్లమెంటరీ బోర్డుకు ఆయన 1934 న కార్యదర్శి అయి, ఆ యేటనే కేంద్రశాసనసభా కాంగ్రెసుపక్షానికి ఉపనాయకుడుగా ఎన్నుకోబడ్డాడు.

నిరంతర కార్యకలాపాలవల్ల ఆయన ఆరోగ్యం చాలావరకు దెబ్బతిన్నది. అంతలోనే 1942 న 'క్విట్టిండియా' ఉద్యమంలో ఆయన చెరసాలకు, పోవడం జరిగింది. 1945 లో ఆయన విడుదలయి రాగానే ముస్లిములీగు - కాంగ్రెసుల మధ్య సిమ్లాలో జరుగుతూండిన రాయబారాల్లో పాల్గొనాల్సివచ్చింది.

1946 ఏప్రిలు మొదటితారీఖున మరల పంతు ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి అయినాడు. అప్పటినుండి 1954 డిశంబరు వరకూ ఆ పదవిలోనే ఉంటూవచ్చి, రాజ్యసభలోని కాంగ్రెసు పక్షానికి నాయకత్వం వహించాడు. ఇంతలో 1955 జనవరి నెలలో కేంద్రమంత్రివర్గంలో దేశీయాంగశాఖా మంత్రిత్వాన్ని వహించాల్సని ఆయనకు ఆహ్వానం వచ్చింది. ఆ పదవిని మహానైపుణ్యంతో నిర్వహించటంలో పటేలుగారి తరువాత పంతుగారే అనటంలో ఏమాత్రం సంశయంలేదు. వీరి దేశసేవాసక్తికి మెచ్చి, భారత దేశాధ్యక్షుడీయనకు- 1957 సం॥న "భరతరత్న" బిరుదాన్నికూడా అనుగ్రహించారు.

పరమేశ్వరుడీ మహాపురుషుని పవిత్రాత్మకు శాశ్వతపదమనుగ్రహించుగాక !

గేయరూపకం :

# పార్వతి

పు. స. ప్రసాద్

[ఈ గేయరూపకాన్ని తొలిసారిగా ప్రదర్శించి ప్రశంసలందుగొన్న "కస్తూర్బా మహిళామండలి" రామాపురం వారికి నా అభినందనలు అందజేస్తూ–దీన్ని వారి కృషికి అంకిత మిస్తున్నా.]

పార్వతి పదారేడుల పడుచుపిల్ల. పల్లెలోపుట్టి. పెరిగి పల్లెవాతావరణం వుణికి వుచ్చుకొన్నది. పదవయేటనే వారి వూరిలోవున్న పేరయ్య పంతులుగారి బడిలో ఐదవ తరగతి పూర్తిచేసింది. ఆ వూళ్ళో పై తరగతులున్న పాఠశాల లేనందున అంతతో చదువుకి"స్వస్తి" జరిగింది. ఆనాటినుండే తండ్రిసంబంధాలు వెదుకసాగాడు.

పాపం! వారిది మధ్యతరగతి సంసారం అవడంచేత కట్నాలు జాస్తిగాపెట్టగల స్తోమతులేనందువలన, ఆయన కాళ్ళకు బలపాలు కట్టుకుతిరిగినా అనువైన సంబంధం దొరకలేదు.

తుదకు రెండువేలు కట్నం తదితరలాంఛనాలు జరిపే ఒప్పందంతో ఏదో ఒకసంబంధం స్థిరపరచాడు, పార్వతి తండ్రి. వివాహం రోజున పార్వతి చెలులు, పార్వతిని పెళ్ళికుమార్తెను చేస్తూన్నారుగావల్ను, ఎంతో సందడిగా ఎకసక్కెలు చేస్తున్నారు–

అందరూ : పార్వతి పరిణయమట
హారతీయగరారె ॥పా॥

ఒకచెలి : చెలినాలిగ గొనెద
చొరవగల్గిన మొనగాడా
కోడెకాడెవడమ్మా
పోడిమిగలవాడేనా? ॥పా॥

రెండయామె : కలికి ముఖము
కమలములా
వికసించెగదే
విభుతలంపున గాబోలు ॥పా॥

కాని.... ........

– కాని ఈ ఆనందాలు అట్టేకాలం నిలువలేదు. తాళిగట్టిన తదుత్తరక్షణాన్నే, లాంఛనాల్లో తగవులు వచ్చి తెగతెంపులు చేసికొని వెళ్ళినారు.

పాపం : పార్వతి బ్రతుకు అధోగతి పాలయ్యింది! అమృతనిష్యందిని అయిన ఆమె జీవితంలో విషబిందువు చిలికినట్లయ్యింది. తండ్రి మారుపెళ్ళి చేదామని ప్రయత్నించినా, సంఘం కట్టుబాట్లూ, కుటుంబ సాంప్రదాయాలు పెట్టని కొండల్లా నిలిచాయి.

పార్వతి దుఃఖం మార్దవహృదయాలకు మారణాస్త్రం లాంటిది.

పార్వతి : ఏదిగతినాకిక
ఏమిచేయుటనేను
నాదుజీవితమిక
వ్యధాభరిత మేనా? ॥ఏ॥

కడు ఇడుములు పడుటేనా?
కడకు వెతలపాలేనా?
ఎందులకీ బ్రదుకు
వృధాయై మంటిగలియక? ॥ఏ॥
స్వామి సేవయులేదు
నామనమ్మింకొకరి
నొల్లనేరజనదూ
కల్లయేనా సౌఖ్యం ॥ఏ॥

అవును, స్త్రీ ఒక్కసారే ఎవరికైనా మనసీయగలదు. అతడు పరిచితుడేగాక! మరో వివాహానికి ఏస్త్రీ మనస్సంగీకరిస్తుంది? పార్వతిలో మాత్రం స్త్రీ హృదయం నెలకొనలేదూ?

కాని, అమెని తలిదండ్రులెంతకాలం పోషిస్తారు? ఆసలే చాలీచాలని ఆదాయంతో సంసారనావ నీడ్వలేక సతమతమౌతూన్న వారి జీవితాలకు మరొకవ్యక్తి కూడా భారమే అనిపిస్తుంది. చిర్రు బుర్రులూ. కస్సు బుస్సులూ, అధికమైనాయ్!

పార్వతి ఈ జీవితానికి వగచింది! ఆత్మహత్య ఒక్కటే శరణ్యమనిపించింది. అదే వుద్దేశంతో ఎన్నో సార్లు అందుకుప్రయత్నాలుకూడాచేసింది! కానిచావుగూడా అంతసులభమైందికాదు! ఎమయితే ఏం? ఆమె ఈ సంకల్పం వదలుకోవాల్సి వచ్చింది. కడకు గుండె గండ్రశిల చేసికొని అలాగే రోజులు వెళ్ళబుచ్చుతోంది!

బృందగానం :

అంతలోన వారివూరను
అవతరించె నొకబ్లాకు

యువజన సంఘాలును,
వ్యవసాయ సంఘాలును,
మహిళా మండలులును,
మరెన్నో సంఘాలువెలసె ॥అంతలో॥

పిన్నపెద్దలందరికీ వేడ్కమీర
ఎన్నెన్నో బడులువెట్టిరి
పొదుపు అదుపుబాగుసేతలు
పాడిపంట వృద్ధిసేత లెన్నెన్నో ॥అంతలో॥

ముదితలకొరక కుట్టుకేంద్ర
మ్మును కల్పతరువుగాగ
స్థాపించిరి వారిపూరచే
రిపించిరి ఎందరినో ॥అంతలో॥

ఆబ్లాకులో పనిచేసే ముఖ్యసేవిక, గ్రామసేవికలు, పార్వతినిగూడా తమ కుట్టుపని శిక్షణా కేంద్రంలో చేర చేరమని పట్టుబట్టారు. అయితే అమ్మా, నాన్నా ఒప్పుకో వద్దూ. ముఖ్యసేవికగారు నచ్చజెప్పి వారి ఆమోదముద్ర వేయించుకొన్నారు. వారుకూడా చెట్టంత కూతురు తమ ఎదుట కాపురంచెడి కుములుతూకూర్చుంటే భరించలేక కొంత స్థిమితంగానేనా వుంటుందని పార్వతిని కుట్టుపని కేంద్రంలో చేర్చారు.

అదుగో! పార్వతి తన దుఃఖాన్ని దిగమ్రింగుకొని, నలుగురు ఆడవాళ్ళతో అల్లిక, కుట్లూ నేర్చుకుంటూ ఎంత ఆనందంగా వుందో!

పార్వతీ, తతిమ్మా మహిళలూ! (బృందగానం)

రారండీ! రారండీ!
రారండి రమణులారా
కుట్లు గుట్లు మట్లు
కుదురుగాను నేర్వండీ ॥రా॥

మన భారత మహిళల
మందరమూ దేశసౌభాగ్య
సౌధమ్మునకు వెయ్యాలి
ఎన్నెన్నో మెట్లు, లేపాలి
కడు ఉవ్వెత్తుగానే
సౌధనిర్మాణమ్ము ॥రా॥

శాంతిజ్యోతి నెల్లెడలా
కాంతివంతం చెయ్యాలి
దేశం కడుభోగమ్ముల
భాసించగ భాగ్యమ్ముల
అనవరతం కృషిచెయ్యాలి
మన బాధ్యతెరిగి మసలాలి ॥రా॥

కొన్నాళ్ళకు పార్వతి కుట్లూ, అల్లకం, నవారునేత పనుల్లో ఆరితేరింది. బ్లాకువారే ఆమెకొక అంబర్ చర్ఖా సగంధరకి కొనిఇచ్చారు. ఆమె ఈ చిన్న చేతి వృత్తుల మీద ఎలాలేదన్నా నెలకు కనీసం నలభైనుంచీ ఏభైరూ పాయలదాకా గడిస్తూంది. మెల్లిగా అల్లకం, కుట్టుపనీ మొదలైన వాటిలో పరీక్షలకుకూడాకట్టి కృతార్థురాలైంది. తలిదండ్రులకు కూడా, ఆమె సంపాదన పరురాలై ఆమె కాళ్ళమీద ఆమె నిలబడగల సామర్థ్యం అబ్బినదని సం తోషించారు. ఇలా వుండగా—

ప్రక్క గ్రామమ్ములోన
ప్రమదల కొరకకుట్టు
శిక్షణాకేంద్రం తెరువనెంచి
శిక్షకురాలిగా పార్వతినే
నియోగించిరి బ్లాకువారు
అయాచితమ్ముగ లభించిన
దహో, పదవిగూడ నామెకూ
ధన్యమైన దామెజీవితము ॥ప్రక్కగ్రామమ్ములో॥

ఇదే పార్వతిగాథ:

---

"పాతమారగానె పడిపోదు సంఘము,
వృద్ధిఁజెందు క్రొత్త వెలుగులందు,
పండుటాకు రాల నెండునా వృక్షంబు?
చిగురులెత్తి పెంపు చెందుకలన"

"సుందరాంగియైన, సురకాంతయైనను
నెయ్యమెలుఁగకున్న కొయ్యబొమ్మ
అందకత్తె కంటె అనురాగవతి మేలు
వాస్తవమ్ము నార్లవారి మాట"

## శ్రీ ఝాన్సీలక్ష్మీబాయి మహిళామండలి - అత్తిలి
### మహిళాభ్యుదయ సేవాసమాజం - పెనుమంద

ఈ రెండు గ్రామముల మహిళా సమాజముల కార్యదర్శినులైన శ్రీమతి పద్మావతి, సీతాదేవిగార్లు కొంతమంది సభ్యురాండ్రతో కూడ బయలుదేరి వినోదయాత్రలు చేయుచు తిరుపతి, కాళహస్తి, కంచి, మహాబలిపురం మొదలైన పుణ్య క్షేత్రములను దర్శించి మద్రాసు వచ్చిరి.

ఈ విధమైన యాత్రలు చేయుటానికి వీరికి కొంత ధనం (బ్లాక్ డెవలప్ మెంటు బోర్డునారినిధినుండి) లభిస్తుంది. మిగిలినఖర్చులు సమాజమువారే భరిస్తారు వీరికి మన మహిళాసభవారు రెండుమూడు రోజుల పాటు వుండటానికి వసతి సదుపాయములు కల్పించి తోడ్పడినారు. వీరికి మనసభ, నర్సింగ్ హోమ్, ప్రెస్సు మొదలైన సంస్థలనుకూడ చూపించినాము. వారు ఈ సంస్థలను దర్శించి తమ సంతోషమును ప్రకటించినారు.

## తిరుచునాపల్లిలో సంఘసంక్షేమ సమితి కేంద్రాలు

మద్రాసు రాష్ట్రంలోని తిరుచునాపల్లిజిల్లా, రెండవపంచవర్ష ప్రణాళికా కాలంలో ఇప్పటికి పదికేంద్రాలలో పలువిధ కార్యక్రమాలు జరిగే ఏర్పాట్లతో స్థాపించ బడినాయి. మొదట ఆరు కేంద్రాలు స్థాపింపబడగా, అవి క్రమంగా అభివృద్ధి చెందినాయి. అందలి కార్యక్రమాలు నాలుగుభాగాలుగా విభజింపబడ్డాయి. 1. 2 ఏండ్లమొదలు 5 ఏండ్ల వరకు ఈడుగల బిడ్డలు స్వయం సహాయంతో అన్ని పనులు చేసుకునే బాల్వాడీలు : 2. దుస్తులు కుట్టటం. అల్లికం, చాపలు తయారుచేయటం. మొదలయిన చేతిపనులు నేర్పే మాదర్ సంఘాలు, 3. ప్రసవ శిశు చికిత్సల తరిబీతు, ప్రసవాలయాలు. 4. వయసు మీరినవారికి చదువునేర్పే పాఠశాలలు, ప్రతికేంద్రం ప్రాథమిక చికిత్సలో ఆరితేరిన గ్రామసేవిక అనబడే మంత్రసాని తనిఖీ క్రింద ఉంటుంది. ఆమె కక్కడ స్వచ్ఛందంగా పనిచేసే స్థానికవర్గం సహాయపడుతుంది. ఈ కేంద్రాలలో జరిగే కార్యాలను సంక్షేమసమితి స్థాపకురాలయిన, ముఖ్యసేవిక అప్పుడప్పుడు పరిశీలిస్తుంది.

ఈ కేంద్రాలు-అరియనూన్గుడి, మెట్టుమరుదూరు, కులుత్తలె, పుల్లంబాడి, మేల్కొండకోట్టై, వేలాయుధపాలెం, రెడ్డిమాన్గుడి, అడవదూర్, రాచంద్రతిరుమల, కులుమణి, అండకులం—అనే గ్రామాల్లో వెలిసినాయి. ఇందులో మెట్టుమరుదూరిలోని ప్రసవశాల 4 పడుకలతో ర్పు 22,000 విలువచేసే పక్కాబిల్డింగు కలిగివుంది.- దీనికై కొడియళం గ్రామస్థుడు శ్రీ కే. వి. శ్రీనివాసయ్యంగారి సతీతిలకం- కీ॥ శే॥ శ్రీమతి పట్టమ్మాళ్ శ్రద్ధతీసుకొని యెంతో పాటుపడటం మెచ్చతగిన విషయం. తక్కిన చోట్లలో సామాన్య భవనాల్లోనే పనులు జరుగుతున్నాయి.

ఈ కేంద్రాల నన్నిటిని స్వచ్ఛందంగా పనిచేసే సంస్థలకు ఈ 1961 మార్చి నెల లోపల స్వాధీనం చెయ్యాల్నని (న్యూఢిల్లీలోని) కేంద్ర సంక్షేమసమితి ఆదేశించింది. కాని యథాప్రకారం గ్రాంటులు ఇవ్వటానికి సమ్మతించింది. కేంద్రసమితి గ్రాంటులు గ్రామకేంద్రాలకయ్యే ఖర్చులలో ర్పు 100 కి 75 వరకు మంజూరు చేస్తుంది.

జిల్లా ప్రాజెక్టుల కమిటి అధ్యక్షురాలు శ్రీమతి రూబీ మాణిక్యం "ఈ కేంద్రాలను ప్రజాసంస్థల కప్పగించటం హర్షించ తగిన విషయం" అని వక్కాణించింది. ("హిందూ"-30-3-'61)

## రాష్ట్ర సంక్షేమ సంఘాల ఏడవ వార్షిక సభా సమావేశం

ఈ 24-3-'61 న రాష్ట్రసంఘ సంక్షేమాధ్యక్షుల సలహాసభయొక్క యేడవ వార్షిక సమావేశం న్యూఢిల్లీలోని విజ్ఞానభవనంలో కేంద్రసంఘ సంక్షేమ సభాధ్యక్షురాలైన శ్రీమతి దుర్గాబాయిదేశముఖుగారి అగ్రాసనాధిపత్యంక్రింద సమావేశంఅయింది. ఆసభలో శ్రీమతి దేశముఖుగారు ఇలా చెప్పారు :

"కేంద్ర సంఘ సంక్షేమ సమితిని శాసన బద్ధమయిన స్థితికి తీసికొని రావాల్నని భారత ప్రభుత్వం

నిశ్చయించుకున్నది. ఈ సంవత్సరమే యీ విషయానికి సంబంధించిన చట్టం మన భారత శాసనసభ (PARLIAMENT) లో ప్రవేశపెట్టబడనున్నది. అయితే, యీ చట్టంలో ప్రకృతం కేంద్రసంఘసంక్షేమసమితి పనిచేస్తున్న మూల సూత్రాల విధానంలో మాత్రం మార్పులుండవు. అదిరాష్ట్రాలలోని సంక్షేమ సమితుల పరిస్థితులు చక్కపరచటానికి చాలవరకు ఉపకరిస్తుంది."

సభాప్రారంభం చేసిన భారత దేశోపాధ్యక్షులు శ్రీ॥ డా. యస్. రాధాకృష్ణన్‌గారు, "అభివృద్ధి ప్రణాళికలలో సంఘసంక్షేమ కార్య క్రమాలుకూడా అంతర్భాగమే. సాంఘిక సంబంధాలు, వాటి ధర్మనిర్వహణాలులేని పక్షంలో ఆ ప్రణాళికలన్నీ తుడిచిపెట్టుకుపోగలవు.

రాజకీయంగానూ, ఆర్థికంగానూ మన దేశంలో గొప్పమార్పులు కలుగుతూన్నవి. అందు సాంఘిక విషయం మిక్కిలిప్రధానం. కేవలం అభివృద్ధికార్యాలే ముఖ్యంగాదు. అందులోపలశ్రద్ధ, పెట్టుబడి, పలుకుబడి, ఎంతో అవసరమవుతుంది.

కేంద్ర సంక్షేమసంఘం, రాష్ట్ర సమితులు, తమ కార్యక్రమాలతో. దుర్భర కష్టాలలోను, దైన్యస్థితులలోను ఉన్న ప్రజలకు పెక్కుఅవకాశాలిచ్చి పైకి తేవటానికి పనిచేస్తున్నవి. ఈ కార్యాలలో పనిచేసేవాళ్ళకి చక్కని ఆలోచనలు, తమ పనులయందు విశ్వాసం, ధైర్యసాహసాలు, బాధల్నిఓర్చుకోనేశక్తి ఇట్టిసద్గుణాలుండవలెను. ఇతరుల యిబ్బందులలో హృదయపూర్వకం అయిన సానుభూతికూడా అవసరం అవుతుంది. ఇలాటి స్వభావాలుగలవాళ్ళు నాయకత్వం వహించి నడిపితే తప్పక సంఘసంక్షేమ సమితులు మహత్తర కార్యాలను సాధించి తీరుతుంది" అన్నారు.

(హిందూ 27-3-'61)

---

# వాయువిళంగము క్రిమి సంహారిణి

శరీరంలోపలి సూక్ష్మ క్రిములనేకాక, వాటివల్ల కలిగే దంతరోగాలకుకూడా రామబాణంవంటిది, యీ 'వాయివిళంగం' దీనికి తెలుగులోనూ అరవంలోనూ వాయివిళంగం అనేపేరు. కాని. అసలు సంస్కృతంలో 'క్రిమిఘ్నం' అనే స్పష్టంగా, దాని స్వభావోచిత నామంతో చెప్పబడింది. అందువల్లనే బాలింతలికిచ్చే లేహ్యాలు, చూర్ణాలలో తప్పక చేరుస్తారు.

'వస్తుగుణదీపిక'లో—దీని గుణాల్నిగూర్చి యిలా చెప్పబడింది ; "చేదుగా, సువాసనగా ఉండును, చలువ చేసును. మేహశాంతి, పైత్యశాంతి చేసును. త్రిదోషములను హరించును. క్రిమి, ఎక్కిళ్లు, చర్ది, గుల్మ, బల్లలు, శూలలు, శ్వాస–కాస, అగ్నిమాంద్యము, మూలవ్యాధి, ఉబ్బు, పాండువు, వీటిని జయించును. సంఘంధన నేత్ర రోగములకు మేలుచేసును. మూత్రకృచ్ఛ్రము తొలగించును" దీన్నిగూర్చి. ఢిల్లీ-ఆయుర్వేద పరిశోధవారు ప్రకటించిన క్రింది విషయాలు గమనించతగ్గవి.

## వాయు విళంగము

భారతదేశం, సింహళం, సింగపూర్లలో Embelia-Babrang, berries) వాయువిడంగం సాధారణంగా ఒక ప్రాకుడు తీగెవల్ల ఉత్పత్తిఅయ్యేమూలిక ఇది. దంతాలు, నోరు, గొంతుమున్నగువాటికి కలిగే వ్యాధులను తొలగించే విషయంలో సాటిలేనిది.

(మిగతా32-వ పేజీ చూడుడు)

# వార్తావళి

## 1960–61 జనాభా

### దక్షిణభారత రాష్ట్రాల జనాభా సంఖ్యలు

ఆంధ్ర ప్రదేశ్ :— మొత్తం జనాభా 35,977,999.
పురుషులు 18,175,349.
స్త్రీలు 17,802,650.

మద్రాసు రాష్ట్రం :— మొత్తం జనాభా 33,650,917.
పురుషులు 16,915,454.
స్త్రీలు 166,735,43.

మద్రాసు రాష్ట్రంలోకంటే ఆంధ్ర ప్రదేశ్ జనాభా 23 లక్షలకు మించియున్నట్లు తెలుస్తున్నది. అయితే, ఆంధ్రులు తమ ప్రత్యేక రాష్ట్రానికి చాలవరకు వలసలు వెళ్లినా, మద్రాసు నగర జనాభా మాత్రం పెరిగినట్లు కనిపిస్తుంది.

మదరాసు నగర జనాభా 17,25,216.
పురుషులు 9,07,269.
స్త్రీలు 8,17,947.

మైసూరు రాష్ట్ర జనాభా :— 2,35,47,081.
కేరళ రాష్ట్ర జనాభా :— 1,68,75,919.

### నాగా కొండజాతులకు స్వాతంత్ర్యం

అస్సాము రాష్ట్రానికి చేరిన నాగా ప్రాంతీయులకు స్వయం నిర్ణయాధికారాన్ని మన భారత ప్రభుత్వం అంగీకరించింది. తదనుగుణంగా కార్య నిర్వాహకవర్గాన్ని యెన్నుకోవటానికి 17-2-1961న డా. 'ఇంక్లొన్గ్లిబాట'- అధ్యక్షతక్రింద 42 సభ్యులు గల సభ సమావేశంఅయి, ఈ క్రింది కార్యనిర్వాహకవర్గాన్ని యెన్నుకున్నది :—

అధ్యక్షుడు : షిలూఆవో.

తక్కిన సభ్యులు : జసోకీ అగామి; హోయిషే సేమా; ఆ. సి. సిఖెన్‌జమీర్; అకుంఇంకాంగ్‌చాంగ్.

వీరు ఆర్థిక న్యాయశాఖల విషయాల్లోతప్ప తక్కినవాటి విషయాల్లో అస్సాం గవర్నరుకు తగిన సలహా లివ్వాలి.

ఒరిస్సా రాష్ట్రంలో కాంగ్రెసు గణతంత్ర పక్షాల విభేద కారణంగా ఏర్పడిన దుష్ఫలితాలను రూపుమాపటానికి రాష్ట్రాన్ని అధ్యక్షుని పరిపాలన క్రిందికి తీసుకొని రాబడింది. మరలా మంత్రివర్గ పరిపాలన యేర్పడటానికి 'మిడ్-టరమ్' ఎన్నికలు జూన్ నెలలో జరుగుతుంది.

ఆంధ్ర ప్రదేశ్‌లోని యునైటెడు ఫ్రంటు-మంత్రివర్గాల మధ్య ఏర్పడిన తగాదాలు కేంద్ర సప్లై మంత్రి అయిన శ్రీ కే. సి. రెడ్డి, కృష్ణప్పగార్ల ధర్మమా అని ఒక విధంగా తొలగి ఐక్యం చేకూరడం ఒకవిధంగా శుభావహం. ఇలా చేకూరటానికి ముఖ్యమయిన షరత్తు—యునైటెడు ఫ్రంటువర్గంలోనుండి ముగ్గురిని, మంత్రివర్గంనుండి ఒక్కరిని మంత్రులుగా నియమించటం. ఇందుకై ప్రధానితో సంప్రదించటానికి ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్యగారు ఢిల్లీకి వెళ్లనున్నారు.

### విదేశ వార్తలు

యూనైటెడ్ నేషన్సువారి కోరిక ననుసరించి కాంగోకు బ్రిగేడియర్ శ్రీ॥ కే. ఏ. యస్. రాజు సైన్యాధిపత్యం క్రింద మన భారత సైన్య భటులు దాదాపు 800 లకు పంపబడినారు.

కామన్‌వెల్తు ప్రధానులసభ 8-3-'61 నుండి పది దినాలు లండన్‌లో జరిగినది. మన ప్రధాని మాత్రమేకాక తక్కిన ప్రధానులలోను చాలమంది దక్షిణాఫ్రికా అవలంబించిన జాతి విభేదాన్ని తీవ్రంగా ఖండించింది. అందుపై దక్షిణాఫ్రికా ప్రధాని శ్రీ వెర్వోర్డు కామన్‌వెల్తు కూటమిలో దక్షిణాఫ్రికా సభ్యత్వాన్నే రద్దుచేసుకున్నాడు. నిరాధీకరణాన్ని గూర్చికూడా చాలా చర్చలు సాగినాయి.

ప్రెసిడెంటు కెన్నడీ రాయబారి అవెరెల్‌హారిమెన్ మన ప్రధానిని న్యూఢిల్లీలో కలుసుకొని తన సందేశాన్ని వివరించి, కెన్నెడీ ఆహ్వానాన్ని అందజేశాడు.

### అబలా సాంకేతిక విద్యాలయాలు

ఆంధ్ర ప్రదేశప్రభుత్వం మూడు సాంకేతికవిద్యాలయాలు నెలకొల్పాల్సనిన్ని, అందులో రెండుమహిళలకు ఒకటి పురుషులకు ఉపయోగపడాల్నని యావద్భారత సాంకేతిక విద్యాసంఘంవారు సిపార్సుచేశారు. 14 నుండి 17 యేండ్ల యీడుగల కుమారీమణులకే ఆ విద్యాలయాల్లో ప్రవేశం వుంటుంది. వారికి 'సివిల్ ఇంజనీరింగులోను—సెక్రెటేరియేటుకు సంబంధించిన ఉద్యోగాలలోను తరబీతు ఇవ్వబడుతుంది. మనదేశంలో ఈలాటివిద్యల్లో స్త్రీలను తరబీతుచేసే సంస్థల్లో ఇవే ప్రప్రథమమైనవి. ఈవిద్యాశాలలు 11 లక్షలతో కాకినాడ, హైదరాబాదుల్లో నెలకొల్పబడుతవి. మూడోది, శ్రీకాకుళంలో స్థాపిస్తారు.

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the Year 1960.

**OUT-PATIENT REGISTER:—**

| | |
|---|---|
| No. of Surgical cases treated | 559 |
| „ „ Medical „ „ | 10,742 |
| „ „ Ante-natal „ „ | 3,506 |
| „ „ Post-natal „ „ | 815 |
| „ „ Gyneac „ „ | 1,580 |
| „ „ E.E.N.T. „ „ | 652 |
| „ „ Dental „ „ | 118 |
| Total „ „ New Patients | 17,972 |
| „ „ „ Old Patients | 23,270 |
| Grand Total | 41,242 |

**IN-PATIENT REGISTER:—**

| | |
|---|---|
| No. of Patients admitted for Normal Deliveries | 1,635 |
| „ „ „ „ Abnormal Forceps | 149 |
| „ „ Gyneac cases treated | 348 |
| „ „ Medical „ „ | 875 |
| „ „ Surgical cases treated | 13 |
| „ „ Ante-natal cases e False Pains | 275 |
| „ „ Ante-natal cases e Toxeamia | 44 |
| „ „ Post-Natal cases Treated | 40 |
| „ „ Babies admitted as Lodgers | 1,775 |
| Total | 5,154 |

| | | |
|---|---|---|
| No. of Normal Deliveries | | 1,633 |
| „ „ Abnormal „ Forceps | 143 | |
| Manual removal of Placenta | 4 | |
| Breech | 2 | |
| J. P. Version | 6 | 155 |
| | | 1,788 |

**Note :** Twin Delivery had been two different Delivery hence there is single number extra in total of deliveries.

(True Copy)

(Sd.) Dr. K. R. AMBUJA
*Resident Medical Officer.*

(Sd.) Dr. M. PAVANA BAI,
*Medical Superintendent.*

Smt. V. LAKSHMI PARVA
*Secretary.*

# గ్రంథ సమీక్ష

[సమీక్షకు రెండేసి ప్రతులు పంపాలి]

1. రాయబారము (గేయము) ఎమ్మనూరు చిన్న వెంకటరెడ్డి; పీఠికగాక, 36 పుటల గ్రంథం. వెల: ఒక్క-రూపాయ. వలయువారు: విద్యోదయా పబ్లికేషన్స్, కడప - అని వ్రాయవలెను.

గేయచ్ఛందస్సులోను శ్రీ చిన్న వెంకటరెడ్డిగారిది వడిదిరిగినచేయి. ఈకృతి 'అన్నార్థుడైన గానగాడి కంకితం. ఆకటితో మలమలమాడే వాడికి కృతితో కడుపు నిండుతుందా? ఇది ఒకవిధంగా గానగాణ్ణి వేళాకూళం చేయడంగా ఏకొందరికైనా తోస్తుందేమో! డొక్క-లెండుకుపోయిన వాడిదగ్గఱ ఈగేయాలు పాడుతూ కూచుంటే "ఏమిటయ్యా! నీరొదఒకటి? చాల్చాల్లే" అంటాడు. వాడికిది చీదర. అయితే, రాయబారమన్నప్పుడు అది అతడి యజమానుడైన ఒకమోతుబరి రైతుకనుకోవాలి. అలా అనుకొని అతడితరఫున ఈ గ్రంథకర్తగారు వకాల్తా పుచ్చుకొని ఆయజమానికి గానగాడి కష్టాలు నివేదిస్తున్నట్టుంది. చూడండి.

"కుంటలోని వండుమట్టి
గుద్దలితో గదలద్రవ్వి
సదరులోన మదిరెవేయ
సన్నాహముతో వాడూ
పొడియెండల మిడియెండల
పూడుగుడ్డ లొకటొకటే
కుల్లగింప పెల్లక్రింద-
కునుకుచున్న తేలుకుట్టి
కుయ్యోమొర్రో అంటూ
కుమిలినాడు కమిలినాడు
కూడుగుడ్డ కుడువలేక
కుతిలపడుచు వెతలబడుచు
చెప్పలేని చెమటలతో
చెదరినాడు బెదరినాడు
ఆమాటా చెబుదామని
నీకెందుకు చెప్పాలని
చెప్పలేక చెబుతున్నా"

ఇది ఈకృతి మొదటిభాగంలోది. మచ్చుకు రెండో దాంట్లోదికూడా ఒకటి.

"పంచాంగశ్రవణఫలము
ప్రతియేటా ముట్టినాది
ప్రతియేటా ప్రజలు పంట
బలముందని కృషిజేసిరి,
ఔనా? మరినాడునాటి
కాకలితో అలమటించు
ఆపద పోలేదటంచు
అనుమతింతువా లేదా?
ఒకడేమో సౌఖ్యడోల
వికసించిన పుష్పగుచ్ఛ
ములలోనే పొంగులాడెను—వాని
తలపులలో తావిగ్రమ్మె
వాడూ ఒకభోగయోగి
ఒకడేమీ లేనిమూల
తుకతుకలై యెదదలుడుక
జడిసిసుడిసి పొరలాడెను-వాని
తలపులలో కావి చిమ్మె
వాడూ ఒకతూగుజోగి
ఏవంవిధ పరిసరాల
నేమని వర్ణింతు మీకు
యేమని వాదింతు నిపుడు
ఐనా—మేమూరుకొనుట
కౌనా! అది యేటిమాట?

ఈగ్రంథకర్త మాండలికసాంకేతికాలకు స్వస్తిచెబితే బాగుంటుంది. పుస్తకం 'గెటప్' చాలబాగుంది.

2. రూపాంతర శతకము ౧. కర్త: విద్వాన్ కోగంటి మల్లికార్జునరావుగారు; భారతీ సమితి; వెల 0-6-0 లు. వలయువారు గ్రంథకర్తగారి పేర 'పామఱ్ఱు', కృష్ణాజిల్లా అని వ్రాసికొనవలెను.

పూర్వ కవుల్లో ఒకరిద్దఱు నానార్థ శతకాలు వ్రాసేరు. అలాటివి ఒకవిధంగా శబ్దకోశాలుగా పిల్లలకు ఉపకరిస్తాయి. తెలుగులో తగినంత సరకులేని ఈనాటి విద్యార్థులు నిఘంటువులు చూచేంత పాటవం, ప్రజ్ఞగడించని కారణంచేత ఆ నానార్థ శతక పద్యాలనయినా బట్టీ పట్టితే, వారు ఏరవంతయినా శబ్దభావాలు గ్రహింపగలరని తత్కర్తల ఊహ. ఊహమాత్రమే గాదు. అలాగే జరుగుతూ వచ్చిందికూడా. ఆంధ్ర నామసంగ్రహం, ఆంధ్ర నామశేషం, ధనంజయ నిఘంటువు, అమరకోశం, ఇవన్నీ ఛందోబద్ధాలుచేసిన పద-పదార్థనిఘంటువులు.

ప్రకృతం శ్రీ మల్లికార్జునరావుగారు ఒక నూతన పక్కీని అవలంబించారు. నానార్థ శతకాల మోస్తరే, రూపాంతర శతకాలేల వ్రాయరాదని. అదే(వారిఆతలంపే) ఈ కృతిరూపాన్ని తాల్చింది. అయితే, పరీక్షలకు ఇచ్చే ప్రశ్నలలో ఎందరు ప్రాశ్నికులు ఈ రూపాంతరాలు స్పృశిస్తున్నారు? రూపాంతరాలంటేనే వారికి తగని భయం. కాదూమరి? నక్కల రాయడు బెబ్బులితల తగిలించుకుంటే, తక్కిన మృగాలకన్నిటికీ భయమేకదూ!

ఈ గ్రంథంలో మరొక విశేషంకూడా. వీరిచ్చిన రూపాంతరాలకు శబ్దశాస్త్ర సూత్రాలకు చక్కని లంకె కుదురుతుంది, కాబట్టి పిల్లలు దీన్లోని పద్యాల్ని కంఠస్థం చేసుకోవటంతోబాటు, వాటికి సంబంధించిన వ్యాకరణ సూత్రాలనుగూడా నేర్చుకోటానికి అవకాశముంది. చూడండి :—

"పద మధ్యమందలి 'న, ల, డ, ర'—ల ఉత్వంబు నకు లోపము."

"పిలువకు రూపము పిల్వగుఁ
గలువకు రూపాంతరంబు గల్వయ్యెఁదగన్
చెలువకు రూపము చెల్వగుఁ
జెలువమునకు వేఱురూపు చెల్వంబయ్యెన్"
"క్వచిద్గకారోవః"
ఇగురునకు రూపమివురగు
ముగురునకున్ వేఱురూపు మువురనిరి బుధుల్.

ఇలాగే :— ఐ-ఔ-లకు, అయి-అవు-లగు అను సూత్రాన్ని అనుసరించిన రూపాంతరాలున్ను కనబడు తున్నాయి. మొత్తానికి ప్రతి విద్యార్థిదగ్గఱ తప్పక ఉండ దగిన గ్రంథం.

---

## వాయివిళంగము క్రిమి సంహారిణి

(28-వ పేజీ తరువాయి)

ఓషధుల పరిశోధన చరిత్రలో మొదటిసారిగా, అనేక వ్యాధులను కుదుర్చుటలో ఇది అత్యద్భుతంగా పని చేయడాన్ని నిపుణులు గుర్తించారు. కాని 3000 ఏండ్లనుండి మనదేశంలో ఇది శరీరంలోని సూక్ష్మదుష్టాణువులను నాశనంచేసే దివ్యౌషధంగా వాడుకలో ఉన్నది.

ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లోని ప్రసిద్ధిపొందిన వైద్యశాలల్లోను, దంతచికిత్సాలయాల్లోను ఇంకను ఈ మూలికనుగూర్చి పరిశోధనలు కరుగుతూన్నవి. అందులో న్యూయార్కులోని 'బెలోర్' (Bellore) హాస్పిటలు, 'బాటిల్ ఫోర్డు'లోని 'సాస్కట్ చ్యవాన్' (Saskatchewan) హాస్పిటలు, మాండలే జనరల్ హాస్పిటలు ముఖ్యము లయినవి.

ఢిల్లీరాష్ట్ర ఆరోగ్యశాఖా మంత్రిణిగా నుండిన డాక్టరు సుశీలానాయరుకూడా ఈ మూలిక విషయంలో ఇంకా పరిశోధనలు సాగిస్తున్నారు.

ఇది ఢిల్లీ ఆయుర్వేద పరిశోధనసంఘంవారు విస్పష్ట పరిశోధనలతో కనుగొన్న గొప్ప ఓషధివిషయాల్లో ఇది రెండవది. మొదటిది (పునర్నవ) గలిజేరు నేత్రరోగాల కన్నింటికి ముఖ్యమయిన ఓషధిగా పరిశోధించి కనుగొని ఋజువుచేయటం. ఆ సందర్భంలో ప్రపంచంలో సులోచనాల వాడకం చాలవరకు తగ్గటంవల్ల ఒక తీవ్ర సంచలనంకూడా చెలరేగింది.

జర్మను-బ్రిటను-అమెరికా విజ్ఞానవేత్తలు 'గలిజేరు' మూలికలోని సత్తానుగ్రహించే పరిశోధనలో ఇంకా పనిచేస్తున్నారు.

ప్రెసిడెంటు ఐసన్‌హోవరుగారు భారతదేశానికి వచ్చినపుడు, ఈ 'గలిజేరు'ను వైట్‌హౌసుకు తీసుకువెళ్లారు.

ఢిల్లీ ఆయుర్వేద పరిశోధన సంఘానికి అధ్యక్షులైన కవిరాజ్ కే. ఎల్. ఖేటాల్‌గారిని పాశ్చాత్య పరిశోధకులు క్రొంగ్రొత్త పరిశోధనాంశాలను గూర్చి తరుచుగా వాకబుచేస్తూవస్తున్నారు.

(ఢిల్లీ ఆయుర్వేద పరిశోధన సమితి కార్యాలయంవారి 'కరపత్రము'నుండి అనువాదం)

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

మహిళా విద్యాలయము : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఎడ్మిషన్, ఆంధ్రామెట్రిక్. ఇ.ఎస్.ఎల్.సి., పరీక్షలకు శిక్షణ.

పారిశ్రామిక విద్యాలయము : కుట్టు. ఎంబ్రాయిడరీ. ఊలు అల్లికలు, నూలు వడకుట' చేనేత. అచ్చుకూర్పు. ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము

మహిళా మందిరము : విద్యార్థినులకు వసతి గృహము

ఆంధ్ర మహిళ : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక

నర్సింగ్ హోమ్ : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ. దంత వైద్యశాల—అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణకూడ యివ్వబడుచున్నది.

ఆర్థోపీడిక్ సెంటర్ : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమకేంద్రం

ముద్రణాలయము : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్. ప్రూపురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును ప్రింటింగు జాబ్ వర్కుస్ చేయబడును

నాగేశ్వర శిశువిహార్ : పిల్లల విద్యావినోద కేంద్రం ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది.

అర్బన్ వెల్ఫేరుప్రాజెక్టు : కపాలి తోట్టంలోను నారాయణస్వామి గార్డెన్‌లోను బీదలకు సంక్షేమ కార్యక్రమముల నిర్వహింపబడుతోంది.

వనితా బాలవిహార్ : స్త్రీలకు, పిల్లలకు- పార్కు, ఆటస్థలం

రీజియనల్ హాండీక్రాఫ్ట్సుయిన్స్టిట్యూట్ : ఆంధ్రమహిళాసభ, హైదరాబాదుబ్రాంచిచే నడుపబడుచున్న, చేతిపనుల శిక్షణాలయము

# 'ఆంధ్ర మహిళ'

(ఆంధ్ర మహిళాలోకాభ్యుదయ మాసపత్రిక)

వ్యవస్థాపకురాలు :
శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్.

విడి పత్రిక—37 నయాపైసాలు ప్రత్యేక వార్షిక సంచికతో కలిసి
సం॥ చందా - రూ. 6-00.

పంచాయతీ సంస్థలకు. సంక్షేమ సంఘాలకు, పౌరజన గ్రంథాలయాలకు
పాఠశాలా పుస్తక భాండాగారాలకు సగము చందా సం॥ రం॥ కి రూ. 3-00 లు.

## పత్రికా విక్రయసంస్థల యేజంట్లకు

1. 'ఆంధ్ర మహిళ' ఆరింటికంటె తక్కువ ప్రతులకు ఇచ్చే ఆర్డర్లు గమనింపబడవు.
2. పత్రికకు 1 కి 12 న. పైసాలు కమీషను ఇవ్వబడును. పోస్టేజి మేమే భరింతుము.
3. విక్రయంకాని సంచికలు వాపసు తీసికోబడవు.
4. ప్రతినెల "ఆంధ్ర మహిళ" ఎన్నిప్రతులు కావలెనో సూచిస్తూ. అసలుక్రయంలో కమీషను మొత్తం మినహాయించుకొని, తక్కిన మొత్తంతో వచ్చే ఆర్డర్లు అంగీకరింప బడును.
5. ప్రత్యేక వార్షిక సంచిక ప్రతి 1. కి రూ. 2 లు, అయినా, యేజంట్లకు రూ. 1.50 కే, (అనగా 25. కమీషన్ మినహాయింపుతో) ఇవ్వబడుతుంది.

## ఆంధ్రమహిళ

### ప్రకటన రేట్లు

సామాన్యమైన పుట 1 కి. రూ 60. లు,
అట్టకాగితం 2 వ పుట, 3. వ పుట (ఒకేరంగుతో) రూ 80 లు.
4. వ పుట (ఒకేరంగుతో) రూ 100 లు.

కొయ్య దిమ్మెలుగల బ్లాకులు అంగీకరించ బడును. ప్రకటనలు. బ్లాకులు పత్రిక వెలువడే తారీఖునకు 10 దినములు ముందే మాకు చేరాలి.

మేనేజరు,
ఆంధ్రమహిళ
7 ఎ. రోజరీచర్చిరోడ్డు.
మైలాపూరు—మద్రాసు 4.

Printed at Andhra Mahila Press, 7/A, Rosary Church Road, Published and owned by Andhra Mahila Sabha, Madras. Editor - Secretary, Andhra Mahila Sabha.